# సరస్వతీ బుక్ డిపోవారి నవలలు

కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారి

**క్రొత్త నవలలు**

| | రు. అ. |
|---|---|
| గెటప్ | 0- 6 |
| వారేవా | 0- 6 |
| తెరచాటు | 0- 6 |
| కత్తులబోను | 0- 6 |
| మాయలాడి | 0- 6 |
| అబద్ధం పెళ్ళి | 0- 6 |
| రైతుపడుచు | 0- 6 |
| మూడుముఖాలు | 0- 6 |
| డాక్టర్సు వైఫ్ | 0- 6 |
| దేవమిచ్చిన భర్త | 0- 6 |
| ప్రతీకారము | 0- 6 |
| పతిలక్ష్మి | 0- 6 |
| ఆడమళయాళం | 0- 6 |
| గుర్రప్పెళ్లి | 0- 6 |

**డిటెక్టివు నవలలు**

| | | |
|---|---|---|
| బంగారుబరిణె | పా 1 | 1- 0 |
| డిటో | పా 2 | 1- 0 |
| సుడిగాలి | పా 1 | 1- 0 |
| డిటో | పా 1 | 1- 0 |
| దొనే అనే బలేరాముడు | | 0-12 |

| | రు. అ. |
|---|---|
| యమదూత (హత్యాచతుష్టయం) | 1- 0 |
| భయంకరనారీ పిశాచి | 0-12 |
| పరితాపదౌర్జన్యము | 0-12 |
| భయంకర చోరాగ్రేసర చక్రవర్తి | 0-12 |

**చారిత్రాత్మక నవలలు**

| | | |
|---|---|---|
| వనదుర్గము | | 1-0 |
| తపోవనము | | 1-0 |
| జపమాలిక | పా 1 | 1-0 |
| డిటో | పా 2 | 1-0 |
| డిటో | పా 3 | 1-0 |
| చక్రరేఖ | | 1-0 |
| లతాంగి | | 1-0 |
| తానీషా | | 1-0 |
| తాజ్ మహాల్ | | 1-0 |

**సాంఘిక నవలలు**

| | | |
|---|---|---|
| శిశుహత్య | పా 1 | 1-0 |
| డిటో | పా 2 | 1-0 |
| డిటో | పా 3 | 1-0 |
| వేరింటికాపురము | | 1-0 |

వలయువారు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

జంపన గ్రంథమాల. పుష్పము 4.

# కన్నతల్లి



రచయిత:

శ్రీ జంపన చంద్రశేఖరరావుగారు.

Jampana Chandra Sekhara Rao.

ఎమ్. ఏ., బి యిడి., అన్నామలై యూనివర్సిటీ.

[illegible]



ప్రకటనకర్తలు:

శ్రీ కురుకూరి సుబ్బారావు అండ్ సన్స్

అంకితము:



కరుణామయి

మా కన్నతల్లికే

—చంద్రం.

ముద్రణ:

కరుకూరి సుబ్బారావు అండ్ సన్సువారి

శ్రీ సరస్వతీ ముద్రణాశాల, బెజవాడ.

1943 - సెప్టెంబరు.





వెల పదిఅణాలు

౧

ఆ నీలాకాశంవంక చూస్తూ ఉం దామె.

ఆచీకటి తెర తోసుకొని -- ఒక చిన్న నక్షత్రం ఆమెవంక చూచింది; చిరునవ్వు నవ్వింది; అంతే -- పూవులాగ రాలిపోయింది: దానితో ఆమె కన్నీటి చుక్క జారిపోయింది.

“ఆ చీకటింటిలో వెలిగే దీపాన్ని ఎవ రార్పివేశారో! ఆరిపోయిన ఆదీపం మబ్బుతెరమాటున ఎలా మాయమయి పోయిందో!

గగన సీమంతిని వాలుజడలో మెరిసే తారకా కుసుమాన్ని ఎవరు నలిపి వేశారో, ఎవరు రేకులు రాల్చి వేశారో!

ఆకాశ గంగలో ఆడుకొనే హంస నెవరు పట్టుకొని రెక్కలు నరికి వేశారో! ప్రాణాలు తీసివేయాలనా పచ్చినెత్తురు త్రాగివేస్తున్నారు?

ఆ కొండ శిఖరం విరిగి ఆలా సముద్రంలో పడిపోయిం దెందుకో! ప్రశాంతిగా ఉన్న అలల చేతులు పట్టుకొని సున్నాలు దిద్దించేటందుకా!

ఏమిటో ఈ సృష్టి అర్థం కావడంలేదు.

ఈరాత్రి వంక చూస్తూ ఉంటే నా హృదయం ఎందుకో, చిరిగి పోయిన గాలిపడగలాగ గాలిలో గిలా గిలా తన్నుకుంటూంది......

ఆ అర్థరాత్రి ఆమె భావా లలా బాణాల్లాగ ఆమె హృదయ పుటాన్ని చీల్చివేస్తూ ఉన్నాయి.

తెల్లవారింది.

తలారా స్నానం చేయించిన పాపాయి తల, సాంబ్రాణి పొగతో ఆరుపుతూ, ఆనందంగా పాడుతూ ఉం దామె.

“ఏం సుశీలా! ఇవాళ చాలాఆనందంగా ఉన్నావ్?” అంటూ పొరు గింటిసునీతి ప్రశ్నిస్తూ వచ్చింది.

“ఆనందం గా కేముంది?”

“ఆనందమే గా వాంఛనీయము!”

అసని బ్రతుకే ఆశావశము ”

"అలాగా"

"చూడు వదినా! చూడు. మా చిట్టితల్లి బుగ్గ లెలా గులాబి మొగ్గల్లాగ పొంగి పోతున్నాయో? నాచిట్టి తల్లి కనులు చూడు, వెన్నెట్లో కడిగిన నీలాలలాగ ఎలా అందాలు చిందుతున్నాయో!"

"అయితే వళ్ళో కట్టుకు తిరుగు తావా!"

"అమ్మో! బట్ట ఒత్తుకొని పాపాయి పాదాలు కందిపోవూ... నా హృదయంలో నే తీయని పూలపాన్పు వేశాను. దానిమీదే మా చిట్టితల్లి ఆడుకు టుంది."

"రేపు మా అబ్బాయికి పెళ్ళి చేసినా విడిచిపెట్ట వేమిటి?"

"మీ అబ్బాయిని ఇల్లరికపు అల్లుడ్ని చేయనూ... చాలు చాలులే. మా చిట్టి ఎన్నటికీ అత్తవారి గుమ్మం తొక్కదు."

"తొక్కితే నే పాదాలు కందిపోతాయూ!"

"కందిపోవూ... చూడు .. ఎంత ముద్దులొలుకుతున్నాయో!"

అంటూ సుశీల తనకుమార్తెను చేతులలో ఉయ్యాల ఊపుతూ గుంటలు పడిన గులాబీ మొగ్గల వంటి బుగ్గలపై — ముద్దులవర్షం కురిపిస్తూవుంది.

సుశీ! ఏమి ఆనందమే"

"కాదా వదినా"

గీతం:— ""మా చిట్టి నవ్వులే
మాకు రత్నాలు;
మా చిట్టి కన్నీళ్ళు
మాకు నీలాలు;"

తెలిసిందా వదినా!

"మా చిట్టి ముద్దులే
మా మేలి ముత్యాలు;
మా చిట్టి మాటలే
మా పూజ మంత్రాలు:"

వింటున్నావా వదినా!

"మా చిట్టి చేతులే
మా కబ్బు దివెసలు;
మా చిట్టి పాదాలే
మా యింటి దేవతలు;"

చూస్తున్నావా వదినా! మా చిట్టి బంగారు పాదాలు అంటూ పాపాయి పాదాలను కళ్ళకద్దుకుంటూ ఆమె కన్నీటితో పాదాలు తడుపుతూ... మేడ మీదికి పరుగుపరుగున పాపాయిని తీసుకు వెళ్ళింది.

ఏమిటో ఆ 'కన్నతల్లి' వెఱ్ఱి ఆనందం.

ఆకాశాన్ని కొలవవచ్చును; సముద్రపు లోతులు చూడవచ్చును; పర్వతాలుకూడా దాటవచ్చును; భగవంతుని హృదయంలో భావకూడా చదవవచ్చును. ఏమైనా చేయవచ్చును. గాని "కన్నతల్లి" ప్రేమకు లోతులు కొలవలేం; దానికి అవధిలేదు; అంతులేదు; దాని కదేసాక్షి.

నది వద్దున జేరిన పడవనుంచి బొగ్గు బస్తాలను మోయలేక 'నిట్టూర్పులు విడిచే కష్టజీవిలాగ బరువులు మోయలేక పొగలు కక్కుతూ సామర్లకోట స్టేషన్లో మెయిలాగింది.

చిట్టి పాపాయిని భుజంమీద వేసుకొని సుశీల భర్త గురించి చూస్తూ ఉంది. సెకండుక్లాసు పెట్టెలో నిలబడి ఉన్నాడు సుధీర్.

ఆమె చూచింది.

కన్నులు చెదిరిపోయాయి; హృదయం కొట్టుకుపోయింది.

"సుధీర్ —"

"సుశీ —"

ఆమె పరుగు పరుగున కంపార్టుమెంటువద్దకు వెళ్ళింది.

"సుశీ —"

"సుధీర్ —"

అతడామె చేయి పట్టుకున్నాడు. అతనిముఖం చూడలేక ఆమె సిగ్గుతో తలవంచుకుంది — బొటనవేలితో నేలను మీటుతూ నిలబడిపోయింది.

"సుశీ! ఎంత చిక్కిపోయావ్"

"చిక్కక బలుస్తానా"

"అశ్రుల్నేపావం! వియోగం యెముకలలోని మూలుగును సహితం, ఆహుతి చేస్తుంది"

"___ ___ ___"

"సుశీ! ఈ పాపాయి ఎవరు?"

"___ ___ ..."

"ఆ ఇంటినుంచి ఎత్తుకు వచ్చేశావా?"

"లేదు."

"ఎవరి పాపాయో పాపం! ఏడుస్తుండగా నే ఉంచా"

"ఎవరిపాపాయో నాదగ్గరుంచుకుంటుంది సుధీర్!

"అయితే మన పాప యేమిటి?"

"................."

"మనకు కలగదనా పెంచుకుంట."

"పెంచుకుంటా వేమిటి?"

"పెంచుకోపోతే ఉంచుకుంటం అనుకో . మొత్తానికి ఎవరిపాపాయో గాని "కన్నతల్లి" హృదయానికి హత్తుకుపోయినట్లు హత్తుకుపోయింది."

"ఎవరిపాపాయేమిటి? మనపాపాయే"

"మ___న___పా___పా___యా!"

"కాదుమరి! లేకపోతే ఇతర పిల్లల్ని పెంచుకుంటానికి గ్రహచార మేమిటి?"

"మ___న___పా___పా___యా!"

అతని నరాలు కదిలిపోయాయి.

ఆపాపాయిని రెప్పవేయక చూస్తున్న అతని కన్నులలో ఎందుకో వింతవింత నల్ల మబ్బులు కదిలిపోతూ ఉన్నాయి. అవి అగ్నివర్షాన్ని కురిపిస్తాయో! ఏనాటి మానవ హృదయం ఎవరికి తెలుసును?

సుశీలా సుధీరు ఇంటికి చేరారు!

వారివారి స్నేహితు లంతా గుమిగూడారు.

"సుశీ! పాపాయిని మా అన్నయ్యకు ఇచ్చావా?" అంటూ సుమతి నవ్వుతూ ప్రశ్నించింది.

"క్రొత్త...ఇంకా మా పాపాయి మా అన్నయ్య వద్దకు వెళ్లలేదు."

"అయితే ఇంకా ఇవ్వలేదన్నమాట."

"తొందర లేముందిలే వదినా..."

"ఏమీలేదు...ఇలాగిచ్చి అన్నయ్యకు నీళ్లు తోడుపు."

పాపాయిని సునీతికి ఎంతో కష్టంమీద దిచ్చింది

లోపలకు వెళ్లి నీళ్లు తోడింది.

"సుధీర్... స్నానానికి నీళ్లు తోడాను."

"అప్పుడే!"

"త్వరగా స్నానం చేస్తే మడికట్టుకోవచ్చును."

"మడా?"

"ఏం ఆచారాలన్నీ సముద్రంలో కలిపివేశావేమిటి?"

"ఆచారాలేమిటి సునీ..."

"బాగుంది. అక్కడ స్నానంతో చేయకుండాకూడా భోంచేసేవాడవేమిటి?"

"స్నానాలేమిటి? జపాలేమిటి?"

"అన్నీ అడుగంటాయ్."

"ఆచారాలడుగంటితేనేగాని ఆంగ్లవిద్య రాదు సునీ!"

"బాగానే ఉన్నాయ్ పాడుచదువులు."

"నామార్పు గ్రహిస్తే ఇంకా ఆశ్చర్యపోతావనుకుంటా."

"ఇంకేమీ మార్పులు వద్దుగాని ... స్నానంచెయి . . ." సుధీర్ స్నానానంతరం భోజనాలయ్యాయి . . మేడమీద పాత దంపతులు క్రొత్త చూపులు చూచుకొన్నారు. . ."

"కోరలుతీసినా విషసర్పాన్ని ముద్దు పెట్టుకోలేం."

"నవనవలాడే లేత తమలపాకువంటి బుగ్గలున్నా చిట్టిని ముద్దుపెట్టుకోలేను" అనుకుంటూ సుధీర్ హిందూపేపరు మేడమీద పడక కుర్చీలో పండుకొని చదువుకుంటూ ఉన్నాడు.

చిట్టికి ముస్తాబుచేసి, దొరపిల్లలా తయారుచేసి, కన్నతల్లి ప్రతీకా వాత్సల్యాన్ని కురిపిస్తూ మేడమీదకు వెళ్ళింది.

"సుధీర్ — ఇదిగో మరయింటి దీపం"

"ఇంటిదీప మని ముద్దు పెట్టుకుంటావా?"

"మన చిట్టే మన యిలవేల్పు"

"అయితే రమా మణి గోవిందో హరి అని ఒక కొబ్బరికాయకొట్టేయ్"

"మా చిట్టే మన రత్నాల హారం"

"అయ్యో బాబోయ్! కాపాడుకో లేక చావాలి"

"మా చిట్టే మన కన్నీటి నిలం"

"నిలమా? శూలమా?"

"అబ్బా! ఏం మాటలు సుధీర్! హాస్యాలకైనా మా చిట్టినంటే ఊరు కోను సుమా!"

"ఊరుకోక ఉరిపెట్టుకుంటావా?"

"ఆ! అంతపనీ చేస్తాను"

"అయ్యబాబు — అలాగైతే ఏమీ అననులే"

"చూడు సుధీర్! వెన్నెల తీవకు పూచిన తొలిమల్లిపూవులాగ;పాపాయి కళ్లు లెలా మెరిసిపోతున్నాయో. తుమ్మెదరెక్కలవంటి పాపాయి ముంగురులు చూడు, ఎంతముద్దు వస్తున్నాయో! గున్నమామిడి లేతచివురులా చిరునవ్వులందే ఈ పెదెములు చూడు, ఎంత కనులపండుగగా ఉన్నాయో"

"అవునవును"

"మా చిట్టితల్లి పాలబుగ్గల్లో మూడు లోకాలలోని వెన్నెలపొంగుల సౌందర్యం ప్రతిఫలిస్తుంది"

"నిజం – నిజం"

"మాతల్లి చెక్కిట చేయిచేర్చి నిమిరినా – మా చిట్టి కన్నుల వెన్నెల నీడలో నిలచినా – ఏదో ఆనంద ప్రపంచంలో ఉన్నట్లుంటుంది"

"సుశీ! ఎవరిపిల్ల ఎవరికి ఆనందం కాదూ?"

"అందరికే ఆనందమేనా"

"ఎందుకాదు"

"అయితే నీవు ఒకప్పుడూ – ఎత్తుకున్న పాపాన్న పోలేదే?"

"అలవాటు లేక"

"దీనికీ అలవాటు కావాలా?"

"కావద్దా మరి?"

"సుధీర్! నిండు చెందురుని పండువెన్నెలలో చేతులెత్తి పిలిచే మల్లె పూలను చూస్తున్నవానికి, ఆనందించడం కూడా అలవాటు చేయాలా?... కన్నతల్లి వడిలో చిరునవ్వు ముత్యాలు, చిలికే పాపాయి పాలబుగ్గలను చూచి ఆనందించడం కూడా అలవాటు చెయ్యాలా?"

"అవసరం లేదు."

"సాయంసమయం జలజలా పారే సెలయేటి ప్రక్కన, జవ్వనొకర్తు అమరనాదం వెలువరుస్తూ తీయనిగీతాలు తీస్తుంటే – ఆగీతికా మాధుర్యాన్ని ఆస్వాదించడానికి కూడా అలవాటు కావాలా? సంధ్యాంగన జలతారు బట్టలు కట్టుకొని, మబ్బుతెరలు తోసుకొని, పకపకా నవ్వుతూ వస్తుంటే ఆ నవ్వులో కరిగిపోవడానికి కూడా అలవాటు కావాలా"

"అవసరంలేదు ... సుశీ ... అవసరం లేదు."

"మరే ...?"

"ఒకమాట చెబుతా విను"

"చెప్పు."

"మనతోటలో గులాబీ వికసించిందనుకో ... కళామయులు ఆ పూవును దూరాన్నుంచే చూస్తూ ఆనందపరవశులౌతారు. స్వార్థపరులు కోసుకుంటారు. ఇందులో ఎవరు గొప్పవారు?"

"కళామయులే"

"అలానే పాపాయి చిరునవ్వులు చూస్తూ దూరాన్నుంచే ఆనంద వాహినిలో అలనై కలసిపోతున్నాను."

"అలా చెప్పూ?"

"కాకపోతే ... ఎవరిబిడ్డ అంటే ఎవరికి ముద్దుండదు సుశీ!"

"బాగా చెప్పావ్ ... "

ఆపైన్ని తల్లికి అతనియుక్తివాదన వచ్చింది. దానితో బ్రహ్మానందంతో పాపాయి నెత్తుకొని ... ఆడిస్తూ ... లాలిస్తూ...

"చిట్టికదే నా పట్టికదే –
చిన్నారిగదే పొన్నారిగదే"

అని పాడుకుంటూ మేడమెట్లు దిగి వెళ్ళిపోయింది.

కన్నతల్లి వాత్సల్యాం చూస్తుంటే కరిగిపోతున్నాడు సుధీర్ ... ఆమెకు పాపాయి ఒక మేరుపర్వతం; ప్రపంచంఅంతా ఒకగడ్డిపరక ... పాపాయి పొదాలే ఆమె స్వర్గీయ మందిరాలు; స్వర్గం ఆమెకు రాలిపోయిన పండుటాకు...

అసలి కామె మాటలు వింటూఉంటే ప్రపంచంలో ప్రత్యణువూ మాతృ ప్రేమలో మారుమోగిపోతున్నట్లుంది ... పేదరాలు సహితం తన పొత్తిళ్ళలో పెట్టి పెంచుకుంటుంది తన కన్న సంతానాన్ని. కోతులు సహితం బిడ్డలను తమవెంట తీసుకువెళ్ళుతున్నాయి ... ఈసృష్టినంతా పరిశీలిస్తే ఏ తల్లీ ఏపిల్లనూ విడువడంలేదు ... ఏతల్లికీ తనపిల్లకంటే ఆనందనిధానం కన్పబడడం లేదు.

సుధీర్ తల చేతులతో పట్టుకొని, ఆకాశాన్ని చూస్తూ, ఆలోచనలలో మునిగి పోయాడు.

* * *

"సుశీల కన్నులలో పవిత్రత తొణుకుతూంది. ఆమెమాటల్లో నిర్మల సుదానదులు ప్రవహిస్తూఉన్నాయ్ .... పాపాయి మూడుమూర్తులా తల్లిలాగేఉంది. ఆ పాపాయిని చూస్తుంటే, నాహృదయం రెక్కలు విప్పుకొని ఆనందాకాశంమీదకు ఎగిరి పోతూఉంది. ."

ఆ ఆలోచనలతో అతడు ఆనంద పరవశు డయ్యాడు.

పుత్రికావాత్సల్యం అతని పేగులను కదిలించింది.

వెంటనే గదిలోకి వెళ్ళి పాపాయిఫొటో చూచాడు.

సుశీల రాట్నం వడుకుతూ ఉంటే, పాపాయి ఏకులను పాడుచేస్తూ న్నట్లు ఫొటో చూచాడు ... అనురాగరసంలో అతడు మురిసిపోయాడు.

"సుశీల యెంత పవిత్ర; పాపాయి ఎంత అల్లరిపిల్ల! అనురాగంతో ఉన్న ఆతల్లీపిల్లల గృహంకంటే, కేవలం స్వర్గం యేముంది? అడవిలోఉన్న వసంతశోభ మాచిట్టికనులలో ఎలా దాగుందో!

సుశీల పవిత్రతే - మాచిట్టితల్లి మాఅనురాగకల్పవల్లే.

అలా అనుకుంటూ పరుగుపరుగున మేడమెట్లవద్దకు వెళ్ళాడు.

"సుశీ! సుశ్రీ!" అని కేక వేశాడు. . .

"సుధీర్ . . . పిలిచావా?"

"అవును"

"ఏం విశేషం"

"మన చిట్టి తల్లిని తీసుకురా!"

"కావలసినప్పుడల్లా రావడానికి, మా చిట్టి తల్లేమన్నా చవగ్గా ఉం దనుకున్నావా?"

"లేదు. ఒక్కసారి."

"ఒక్కసారేనా?"

"ఒక్క ముద్దే."

"రెండో ముద్దుకు పాపాయి పాలబుగ్గలు కందిపోతాయి సుమా!"

"అలాగేలే. త్వరగా..."

"తీసుకొస్తున్నాను...ఏమిటీ అవ్యాజప్రేమ?"

"తీసుకురా, చెబుతా!"

ఆమె పాపాయిని ఎత్తుకువచ్చింది. నవ్వుతూ ... మెట్లు దిగుతూ పాపాయికి ఎదురువెళ్ళి..."చిట్టీ... చిట్టీ...చిట్టీ..."అంటూ గొంతుక వణుకుతుంటే, కన్నీరు కారుతుంటే పాపాయిని ఎత్తుకున్నాడు కన్నతండ్రి" గట్టిగా కౌగిలించుకున్నాడు...వారిద్దరి ఆనందాన్ని చూస్తున్న "కన్నతల్లి" కన్నటి కాలవలలో భగవానుడు తన నవ్వు ముఖాన్ని చూచుకుంటున్నాడు.

"హలో! చిట్టీ!"

అంటూ ఆ లేత చిగురాకు పెదవి కదిలిస్తూ పిలిచాడు. చిట్టి చిరునవ్వు నవ్వింది...దానితో అతని హృదయ వీణాతంతుల పై ప్రేమదేవత మధుర నాదాన్ని వెలువరించింది.

"చిట్టీ ... ఇటుఇటు ... అమ్మదగ్గరకు రావూ?" అంటూ చప్పట్లు చరచి, చేతులు చాచి పిలిచింది సుశీల. పాపాయి కన్నతల్లి చేతుల పై వాలిపోయింది. తండ్రి వెనుకకు లాక్కుంటూ —

"చిట్టీ ... అమ్మదగ్గరకు వద్దు ... నాదగ్గరే ఉండు. నీకు బంగారు బొమ్మలు తెస్తా ... తీయని బిస్కట్లు తెస్తా ... ఇంకాఎన్నో తెస్తా ...మీ అమ్మేం తెస్తుంది?" అంటూ పాపాయిని తీసుకొని గదిలోకి వెళ్ళిపోయాడు.

అక్కడనుంచి అద్దంలో పాపాయిని చూపిస్తూ, ఆడిస్తూ, "సుశీ! ఇంక నీవు వెళ్ళిపోవచ్చును...భోజనానికి కూడా పిలవవద్దు... మాపాపాయి

తోనే ఆడుకుంటూ ఉంటాను" అన్నాడు...

"బాగుంది! నీకు భోజనం అవసరం లేకపోతే నాకేనా అవసరం. . మా చిట్టితల్లే నాకు అమృతభోజనం."

"అయితేరా! ఇద్దరం పాపాయితో ఆడుకుందాం."

"అంతకంటేనా...తల్లిదండ్రులకు బిడ్డలకంటే రత్నాల రాసు లేముంటాయి.

"అలా నేనే రద్దూ...! ఇపుడు పిలువు, చూస్తాను?"

"రా దనుకున్నావా?"

"ఎన్నటికీ రాదు. మంత్రం పెట్టేశాను."

"అయితే చూడు...చిట్టీ...ఇటుఇటూ...రా అమ్మా రా!" అంటూ చేతులు చాచింది. ఒక్క గంతులో తల్లి చేతులలో ఉరక బోయింది.

"అమ్మముండా!...మీ తల్లిలాగ నీవూ అల్లరిదానివే."

"ఏం? ఏమైంది?" అంటూ సుశీల సుధీరుని గోలచేసింది.

"నేనే వెళ్ళమని చెవులో చెప్పాను. లేకపోతే వస్తుందీ!..."

"పరుగెత్తలేక నామీదనుంచి బలాదూర్ అన్నట్లుంది."

"మాద్దూ. రెండు రోజులు పోతే."

"జీవితాంతంవరకై నా పాపాయి నా పాపాయే."

"నాపాపాయి కాదా?"

"ఎలాగౌతుంది. చూడుమళ్ళీ పిలుస్తాను." అంటూ అమాయకంగా జవాబు చెప్పి అమాయకంగా పిలవటం ప్రారంభించింది.

ఎలాగైనా వారి ఆనందానికి అంతులు లేవు. "కన్నతల్లి" ప్రేమ గట్టులు తెగిన సముద్రం. "కన్నతల్లి" ఆనందం ఆపకట్టలేని గంగా ప్రవాహం. పాపాయిని హృదయానికి హత్తుకున్న "కన్నతండ్రి" నందన మందార పరిమళవ్యాప్తలంమీద పమన్నట్లుంది...కాళిదాసు చెప్పినట్లు పిల్లల బిగికౌగిలేకదా తల్లిదండ్రుల దేహాలకు చందనగంధం! వారి జిలిబిలి పలుకులే కదా అమృతపు చినుకులు! వారి అమాయకపు చేష్టలే కదా అను రాగపు సరసులు! వారి కమల తళుకులేకదా రతనాల తళుకులు!

పాపాయిని మధ్య పెట్టుకొని ఆ తల్లీ దండ్రులు – ఈ పాపభూయిష్ఠ మైన ప్రపంచాన్ని మరచి పోయి – ఆనంద ప్రపంచంలో స్వర్గీయసుఖాన్ని

అనుభవిస్తున్నారు. ఏమిటో వారి ఆనందం.

నిజంగా వాత్సల్య రస సరసిలో - కలువపూ వడవలా తేలిపోయే వారికంటే ఆనంద శీవు లెవ రుంటారు? వారి జగత్తుకంటే ఎక్కువ స్వర్గం ఎక్కడుంది? ఈ విషయం పిల్లల కన్నవారికి తప్ప బిడ్డలు లేని గొడ్డుమోతు వాళ్లకు తెలియదు లెండి...

* * *

3

వారి అరమోడ్పు కన్నులలో ఆనందలక్ష్మి క్రిక్కిరిసి పోయింది కాబోలు మరోకొత్త దంపతుల నాశ్రయించాలని లేచిపోయింది... కొంత సేపట్లోనే ఆత డింతకు పూర్వం చూచిన తల్లీ బిడ్డల ఫోటో చూచాడు.

"సుశీ ! ఎంత బాగుందీ ఫోటో,"

"ఫోటోకని కూర్చోలేదు కాబట్టి అంత బాగుంది"

"అలాగా"

"నే నోరోజు ఒకరోజు సాయంకాలం పాపాయిని దగ్గర పెట్టుకొని నూలు వడుకుతున్నాను"

"ఓహో !"

"అంతలోకే నాకు తెలియకుండానే...ఎలా తీశాడో తెలీదు...కను మూసి కను తెరచే లోపుగా ఫోటో తయారై పోయిందన్నాడు."

"ఎవ రది?"

"ఇం కెవరు ?"

"సురేశా...?"

"అవును...సురేశ్ కాక మరొకనికి గుండా చెరునా నా ఫోటో తీయడానికి"

"ఆడాసంగతి. అలా చెప్పు సురేశ్ తీశాడా?"

"మరే మనుకున్నావ్"

"ఊరఫోటోగ్రాఫ రెవరైనా తీశాడేమో అనుకున్నాను."

"ఇతరులు తీస్తే అంత చక్కంగా వస్తుందీ?"

"నిజం...ప్రత్యేకంగా నీ చిత్రాలు తీయడానికే వాడు ఫోటోగ్రఫీ. నేర్చుకొని ఉంటా డనుకుంటాను."

"అలాగే ఉంది చూస్తేను...లేక పోతే ఎన్నిరకాల ఫొటోలు తీశా డనుకున్నావ్ సుధీర్!"

"ఇల్లంతా నీ ఫొటోలతోనే నింపి వేశా డనుకుంటాను."

"ఖచ్చితంగా..."

"వాడికి మరోపని లే దనుకుంటాను."

"అదేమో నాకు తెలీదుగాని, రోజు కొక రకం ఫొటో తీసినట్లు తీసేవాడు."

"అయితే రోజూ అటెండెన్సు" ఇచ్చివెళ్ళేవా డన్న మాట."

"తప్పకుండా...పాపం! మన ఇంటికి రాకుండా ఒక్కరోజుకూడా ఉండలేకపోయేవాడు. ఉదయమో సాయంకాలమో వచ్చి, క్షేమసమాచారా లడిగి, కావలసిన సదుపాయాలు చేసి మరీ వెళ్ళేవాడు."

"ఉహూ! అన్ని సదుపాయాలు చేసేవాడు కదా!"

"పాపం మాటలు చెప్పుకుంటం ఎందుకు? ఏది చేయమన్నా చేసే వాడు...మాట చెప్పడం తరవాయి- ఆపని చేసి తీరాడన్నమాటే."

"నీవంటే అంత అభిమానంగా ఉండేవా డన్నమాట."

అభిమానం ఏమిటి? పంచప్రాణాలు ఇచ్చేవాడంటే నమ్ము"

"అవునవును...స్పష్టంగా తెలుస్తూనే ఉంది"

"నిజంగా సుధీర్! సురేశ్ లేక పోతే ఎంత ఇబ్బంది పడేదాన ననుకున్నావ్?...నీవు కూడా చూడవ్ నాప్రాణానికి ప్రాణంగా కంటికిరెప్పగా కాపాడేవా డంటే నమ్ము

"అలాగే...సరే...ఇద్దరూ ఒక్కటిగా జీవితం గడిపారని చెబుదా"

"అలాగే మరి"

"అయితే మన ఇల్లంతా "చిత్రశాల" చేసేయవచ్చును. ఆఫొటో లెవ్వీ?"

"ఇవిగో...ఈపెట్టినిండా ఉన్నాయ్."

"ఇంతవరకూ చెప్పలేదే?"

"ఏదీ...మాచిట్టి గోరువెచ్చని ముద్దుల్లో నన్ను నేనే మరచిపోయాను. ఈ చూపించాలన్నే మరచి పోయాను."

"అవును...స్పష్టంగా తెలుస్తూనేఉంది" అంటూఉంటే ఆమె లేచి

భద్రంగా ఉంచిన పెట్టెడు ఫొటోలన్నీ తీసి చూపించె...

అవన్నీ చూస్తుంటే అతనికి ఆశ్చర్యం వేసింది. అతని అనుమానపిశాచా లకు ఉరిత్రాళ్ళు లాగున్నాయ్. ఆమె పాతివ్రత్యానికి సాక్ష్యాల్లాగున్నాయ్. ఆఫొటోలను చూస్తున్న అతని కనులు కొన్నిగా రెండశ్రు బిందువులు రాల్చాయి.

"సుధీర్...ఏం?...అలా కన్నీరు కారుస్తున్నావే."

- "నేను కన్నీరు కార్చడం లేదు. కరిగిపోయిన నాహృదయం కన్నీటి ద్వారా వ్యక్తం చేసుకుంది."

"ఎందు కసలు..."?

"సుశీ! నీవు ఇంతకాలం ఎలా గడిపావో చూపిస్తున్న ఈఫొటోలు నీపవిత్రజీవితంలో గడిపిన మహత్తర ఆదర్శాలను భారత దేశానికిచాటుతూ ఉన్నాయ్. ఈ దరిద్రబానిస భారత దేశాన్ని...తేజోమయ ప్రపం చంలోకి చేయిపట్టుకొని మార్గం చూపెడుతూ తీసుకు వెళుతున్నాయ్."

"సుధీర్. ఏమిటీ నుతి?"

"పతిచే నుతి పొందే సతికంటె ధన్యజీవిని ఎవరు?"

"నిజం...అంతకంటే అదృష్టవంతురాలు మరొక రుండరు"

"సుశీ...నీవు మహాపతివ్రతవు."

ఆమె సిగ్గుతో తల వంచుకుంది.

"ప్రియతమా! నీవు నాపాలిట భగవతివి, నా పాపాగ్ని నార్పదలచి శివజటాజూటాటవి నుంచి పొంగి పొరలి వచ్చిన గంగాభవానివి."

"సుధీర్! నా పవిత్రమైన కుంకుమ బొట్టు నీకు మేరుపర్వతం; దాని కాంతులలో మెరిసే నాజీవిత యాత్ర నీకు నందన మందార ప్రపవమార్గం, అంతకు మించి ఏమీ లేదు."

"సుశీ! నీ ఒకొక్క మాట అన్నపూర్ణహస్తాబ్జ మందున్న ఒకొక్క అమృతపుమాట."

"సంతోషం."

అంతలో సురేశ్ కెమేరా చేతులో పట్టుకొని తయారయ్యాడు.

"ఓహోహో! దంపతు లేమిటి? ఏమి పొగుడుకుంటున్నారు రాబాబు ఒకరి నొకరు." అంటూ కెమేరా వారికేసి పెట్టాడు.

"సురేశ్. మళ్ళీ ఒకఫొటో తీస్తావా?"

"ఒక్క సెకను... పతికి దూరాన్నున్న సతిపవిత్ర జీవితాన్ని చూపించే చిత్రాలు మాత్రం తీశాను, కాని, సతీపతుల ఆనంద జీవితాలను తీయలేదు కదూ!"

"అం చేత?"

సతీపతులను కలిపి ఒక 'స్నేప్' తీయనియ్"

"వీలేదంటే మూంతావుకాబట్టా......తియ్..."

,,One - Two. Finish. Good Evening.

అంటూ ఫొటో తీసి వేసి సురేశ్ వెళ్ళబోయాడు.

"సురేశ్...ఎక్కడకు?" అంటూ లేచి వెళ్ళి చేయి పట్టుకొన్నాడు సుధీర్.

"ఉండవోయ్...ఒకగంటలో మీ ఫొటో మీకు ఇచ్చేస్తాను"

"ఇప్పుడే..."

"ఎంత...ఇంటికి వెళ్ళి ఫొటో తయారు చేసివస్తాను కదూ!"

"అయితే నేనూ వస్తాను"

"వీలులేదు"

"ఏం ?"

"వస్తే మీసతీపతు లిద్దరూ, చిట్టితో రండి, లేకపోతే వద్దు."

"ఎంచేత ?"

"ఇంకనుంచైనా మీసతీపతులు ఒకరిని విడిచి మరొకరు ఉండడం నేను చూడకూడదు."

"కోర్టుకు వెళ్ళినప్పుడు కూడా తీసుకు వెళ్ళమంటా వేమిటి?"

"తీసుకు వెళితే తప్పనను...కాని ఇద్దరూ వెళ్ళడానికి వీలున్న చోటులకైనా ఒక్కరే వెళ్ళడం నాకు ఇష్టం లేదు."

"తమరి ఆజ్ఞ !"

"అయితే ఇద్దరూ బయలుదేరి రండి. నేను పాపాయిని తీసుకుంటా"

"చిత్తం"

అంతా బయలుదేరి సురేశ్ ఇంటికి వెళ్ళారు.

* * * *

సుధీర్ సుశీలలకు సురేశ్ ఫలహారా లిచ్చాడు. తరువాత తన మేడమీద గదిలోకి తీసుకు వెళ్ళాడు. ఆగది పైన "పుణ్యమందిరం" అని వ్రాయబడి ఉంది.

"ఏమిటోయ్ సురేస్! మీయింటికి "పుణ్యమందిరం" అని పేరు పెట్టావేమిటి?"

"అవును"

"కారణం ఏమిటి ?"

"పుణ్యవతి - భారతసతి - పవిత్రమతి - నివసిస్తూ ఉన్నది కాబట్టి"

"ఎవ రామె..."

"ఇలారా చూపించుతాను...? అని సురేశ్ గది తలుపులు తీశాడు?

ఎదుటగా సుశీల పిల్ల నెత్తుకొని నవ్వుతూ అన్నం తినిపిస్తున్న ఫోటో ఎన్‌లార్జి చేసింది చూచాడు. సుధీర్ ఆశ్చర్యపోయాడు. అక్కడనుంచి ఏ మూలచూచినా అన్నీ సుశీల చిత్రాలే...అదొక చిత్రశాలలాగుంది.

"సురేశ్ ! ఇవన్నీ సుశీల చిత్రాలే ।"

"అవును"

"అన్నీ సుశీలవే తీశావే?"

"ఆమెకంటే రసజ్ఞురాలు - అనురాగహృదయిని - పతివ్రత నాకెవరూ కనుపించలేదు."

"అయితే ఇన్ని ఫోటో లెందుకు"

"వీటివల్ల భారత స్త్రీ ఏకాకిగా ఉన్నప్పుడు చేయవలసిన దినచర్య తెలుస్తుంది."

"అలాగా ?"

"చూడు . ఈపసిబిడ్డ నెత్తుకున్న చిత్రం! ఏమివ్రాశానో చదువు ."

భారత స్త్రీ జన్మ మాతృత్వమునందే సాఫల్యముపొందును..." అని చదివి "బాగుందోయ్ బాగుంది" అన్నాడు సుధీర్ !

"ఇలారా! సుధీర్! ఈ చిత్రాలక్రింద వ్రాసినవన్నీ చదివివినిపిస్తాను వానివల్ల "భారత గృహిణి" ఆచరించవలసిన జీవితం తెలుస్తుంది."

"మంచిది...ఒక ఫోటో చూపించు.

"ఇదిగో ఇదిచూడు. కాలకృత్యాలైన పిదప తెలారా స్నానంచేసి

పసుపుకుంకుములు ధరించి, ప్రాతఃసంధ్యలో పతిపదసేవ చేస్తున్న పతివ్రత" అని వ్రాసింది చదివాడు. ఆఫోటోలో స్కూల సుశీల్ ఫోటోకు పూలమాలలు వేస్తూ పూజ చేస్తున్నట్లుంది. దాని తరువాత తులసిపూజా చిత్రం చూపాడు. దానిక్రింద ఇలా వ్రాసివుంది "పతిపదసేవ తులసిపూజానంతరం భగవద్గీత పారాయణ చేస్తున్న యోగిని ..." చూచావా? అన్నాడు.

"చాలా బాగుంది."

"ఇది చూడు... "పిల్లను ఉయ్యాలలో పరుండబెట్టి జోలపాట పాడుతున్న మాతృదేవి" ... సుశీల ఎంతచక్కగా పాడేదనుకున్నావ్...వీలులేక పోయింది. లేకపోతే ఆది రికార్డు చేస్తే ఏపిల్లలతల్లి పాడకుండా ఉండగలదు?" అంటూ ఆమె పాపాయిని ఉయ్యాలలో పరుండబెట్టి ఊపుతూవున్న టో చూపాడు.

సుధీర్ కనులు ఆనందసముద్రాలయ్యాయి. సుశీలవంక చూచాడు. ప్రేమతో-ఆమె సిగ్గుతో తల వంచుకుంది.

"సుధీర్...రాట్నం వడుకుతున్న ఈఫోటో చూడు. తీరికగలకాలంలో నూలు తీస్తున్న దేశభక్తురాలు—" అని వ్రాసింది చదివాడు...

"సురేశ్...ఈ ఫోటో ఎంతచక్కగా తీశావోయ్. హృదయం కదిలి పోతుంది..."

"మరేమను కున్నావ్?"

"సుశీ! అలాగైతే ఒక్క నిమిషంకూడా వృధా చేయలేదేమిటి?"

"పవిత్రకాలం ఎలా పాడు చేయగలను సుధీర్"

"బాగుంది..."

"సుధీర్... ఈ ఫోటో చూడు! కన్నతల్లి పిల్లతో ఎలా ఆడుకుంటుందో! "పసిపిల్లనవ్వులో ప్రపంచాన్ని మరచిపోయిన కన్నతల్లి" అని దానిక్రింద వ్రాసింది చదివాడు.

"సురేశ్...ఎంత బాగుందోయ్"

"ఇది చూడు...ఆవీధిలో ఆడపిల్లలందరికీ కుట్టుపనులు, వంటపనులు, పాటలు, ఆటలు నేర్పుతున్న చిత్రం..."

"బాగుంది, బాగుంది! దానిక్రింద ఏం వ్రాశావో చదువు!"

"తనఇల్లు చక్క దిద్దుకొని, మిగిలిన వారిఇళ్ళను చక్కదిద్దు

సంఘోపజీవిని" అని చదివాడు సురేష్.

"బ్రహ్మానందంగా ఉంది... ఈ ఫొటో ఏమిటి? ఎవరికో అన్నం పెడుతూందే"

"అవును. రోజూను ఒకరికైనా కడుపునిండా అన్నం పెట్టందే భోం చేయనని మన సుశీలవ్రతం"

"ఏమిటిది? మా సుశీలవద్ద నేటినుంచి నేర్చుకోవలసినవి చాలా ఉన్నాయనుకుంటా"

"నీవేకాదు... స్త్రీ ప్రపంచంలో చాలామంది అనేక విషయాలు నేర్చుకో వలసి ఉంటుంది ..సుధీర్! ఈ చిత్రం చూడు"

"బాగుంది, బాగుంది. పాపాయిని వీపుకు తగిలించు కొని, ఇల్లు ఊడుస్తూందా?"

"మనసుశీల మాతృప్రేమ తలచుకొంటూ ఉంటే మా, అమ్మ నిర్మల ప్రేమ జ్ఞాపకం వస్తూఉంది"

"అయితే సురేశ్...ఈ ఫోటో క్రింద ఏం వ్రాశావ్"

"ప్రపంచంలోని ఆనందం అంతా మోసుకు పోతున్నట్లు పసిబిడ్డను మోసుకు పోతున్న ఆనందమయి..."

అని చదువుతూ సుధీర్ వంక నవ్వుతూ

"సుధీర్ .. ఇటువంటి చిత్రాలన్ని ఎందుకు తీశానో తెలుసునా?" అన్నాడు

"తెలియదు సురేశ్"

"భారత స్త్రీ యొక్క ఆదర్శజీవితాన్ని ఆంగ్లేయులు మొదలగుఅన్య దేశీయులకు చూపించడానికి"

"ఏలా?"

"వరుసగా పుస్తకంలో 'పబ్లిష్' చేసి, ఆమె దినచర్యలగురించి పూర్తిగా వ్రాసి, అన్ని దేశాలకు అందజేస్తాను... చూడు! 'సుశీల భిక్షుకులకు అనాధ బాలికలకు ధర్మం చేస్తున్న చిత్రాలు: పసిపిల్లతో ఆడుకుంటూ ప్రపంచాన్ని మరచి పోతున్న చిత్రాలు; పతే దైవంగా నమ్మి పతిపదసేవ చేసే చిత్రాలు..."

"చాలా అద్వితీయంగా ఉన్నాయ్ సురేశ్"

"నగుసగా చూపిన ఈ చిత్రాలలో గల అంతరార్థం గ్రహించావ్"

"ఈ మట్టి బుజ్జకు అర్థాలే తెలియవు"

అంతరార్థాలేమి తెలుస్తాయి.

"భారత గృహిణి ధర్మార్థ కామమోక్షములను సాధించగలదని చాటిస్తున్నాను."

"ఏం విమర్శనబుద్ధి ఇచ్చాడురా సురేశ్."

"అది కాకుండా నేను చెప్పినట్లు భర్తకు దూరంగా ఉన్న భార్య చేయవలసిన దినకృత్యాలు తెలిశాయా?"

"ఏమిటి..."

"ఆ చిత్రాలు వరుసగా చూడు__

(1) తెల్లవారకముందే స్నానం చేసి పతిపదసేవ చేయడం ----
(2) తులసిపూజ.
(3) భగవద్గీత పారాయణ ... లేదా ఏమతగ్రంథాన్నైనా చదవడం.
(4) పిల్లల క్షేమం చూడడం
(5) నూలు వడకడం.
(6) ఆడపిల్లలకు కావలసిన చదువు చెబుతూ సంఘసేవ చేయడం.
(7) పేద సాదలకు దానధర్మాలు చేయడం.
(8) మాతృత్వాన్ని లోకంలో నిరూపించడం ...

"సురేశ్! పరదేశాలు వెళ్లిన నాకంటే, ఎంతవిజ్ఞానఘనుడవయ్యావ్."

"నీకేమ అలా అనిపిస్తుంది... అయినా నా దేముంది? అంతా మన సుశీల దినచర్యకదా!"

"అలాగే, గోడ లేకపోతే చిత్రాలేం చెక్కగలం?"

అంటూ సుధీర్ సుశీలవంక చూచాడు.

ఆమె చిరునవ్వు నవ్వి పాపాయి బుగ్గలమీద, మూడులోకాల ఆనందాన్ని మూటగట్టిన ముద్దు నొక దానిని ప్రసాదించింది.

సుధీర్ పాపాయిని ఎత్తుకొన్నాడు.

"సురేశ్...నీకు మేం చాలా కృతజ్ఞులం...నీ మేలు మరువలేం... కాబట్టి ఈ రాత్రి మాయింట్లోనే భోజనం చెయ్యాలి."

"వద్దంటానా?"

"సురేశ్...వద్దంటే ఊరుకుంటావా!" అంటూ సుశీల ప్రశ్నించింది.

"ఊరుకున్నా. బలవంతాన మన పాపాయినవ్వే నన్ను తీసుకు పోతూంది."

అంతా నవ్వు కున్నారు......

ఆనందంగా సుధీర్ ఇంటికి బయలు దేరారు. భోజనానంతరం ఇంగండు కబుర్లు చెప్పుకుంటూ రాత్రి తొమ్మిదింటి వరకూ గడిపి, తరువాత "అపవాదు" సినిమాకు బయలుదేరి వెళ్లారు.

వాళ్ళను చూచి వారినిర్మలస్నేహానికి లోలోన సంతోషించినవాళ్లు సంతోషించారు; ఏడ్చినవాళ్లు ఏడ్చారు...లోకులు బహుకాకులు కదా! !

* * *

"పావలా మందాన్న పసుపు రాసుకున్నంత మాత్రాన పతివ్రతలై పోతా రనుకున్నావా?"

"కాదులే సునీతా!"

"గంగగోవులాగ కనబడేవాళ్ళు, తడిగుడ్డలతో గొంతులు కోస్తారు."

"అవునవును."

"పతివ్రత అనే ముసుగు వేసుకొని ఆముసుగులో ఎన్నిగర్భాలన్నా తీయించు కుంటారు."

"అంతా అలా చేస్తా రంటావా?"

"ప్రపంచానికి జడిసినవాళ్ళు... చేస్తారు. ఖచ్చితంగా భర్తను లెక్క చేయకుండా పరాయిపురుషునివల్ల సంతానం కన్నవాళ్లు లేరూ!"

"ఎవ రది?"

"ఇంకా తెలీదూ?"

"సుశీలా??"

"కాదుమరి."అంటుంటే ఆప్రక్కనుంచే వెళ్ళుతున్న సుధీర్ వాళ్ళ మాటలు విన్నాడు. నిలువునిలువల్లా వణికి పోయాడు. ఆ గోడప్రక్కనే నక్కి వింటున్నాడు. వారు తిరిగి ఇలా మాట్లాడు కుంటున్నారు.

"సుబ్బయ్యా! ఒకమాట చెబుతా విను-భర్తంటే నీ కెంతో భక్తితో ఉంటావా? నన్ను పతివ్రత అనకుండా సుశీలను పతివ్రత అంటూ రెందుకో తెలుసా"

"ఎందుకు?"

"అనేక్క విషయాలున్నాయి. భర్త రాగా నీ పాదాలకు మొక్కటం తులసి పూజలు చేయడం— పురాణాలు చదవడం...వీనివల్ల లోకం మోస పోతుంది!

"సునీతా! తన రంకు ఇంకా ఎంతకాలం దాగుతుందంటావ్."

"ఇంకేముంది? పూర్తిగా దాగినట్లే...భర్తనమ్మి వేశాడు. పిల్ల తనకే పుట్టిం దనుకొని ఆనందంగా ఆడిస్తున్నాడు"

"వాడు పట్టి దౌర్భాగ్యు డేమిటి చెప్మా!"

"దౌర్భాగ్యు డేమిటి? పట్టికుంత! అటూ ఇటూ చూచి ఎవ్వరూ లేక పోతే పెళ్ళాం కాళ్ళు పిసిగే రకం కదూ!"

"అలా చెప్పు."

"ఎంతనాట్టి వెధవ కాపోతే ఆ సురేశ్‌గాడ్ని రెండు సంవత్సరాలు జంకు గొంకు లేకుండా ఇంట్లో పెట్టుకొని పిల్లనికంటే—డొక్క చీల్చక పైగా నాపెళ్లాం పతివ్రత" అని నలుగురుతో చెప్పుకుంటాడేమిటి సిగ్గులేక"

"వాడికి సిగ్గేమిటి? పైగా ఇంగ్గండు నుంచి వచ్చాడేమో ఇటువంటి వ్యభిచారాలంటే అతనికి లెక్క ఉండ దనుకుంటాను."

"అంతేలే. సురేశ్ చూడు—ఏవేవో ఫొటోలు దీసి వానివల్ల ఆమె పతివ్రత అని ఋజువు చేశాడు—ఎంతయుక్తో!

"ఏదో వాళ్ళ కర్మంవచ్చినట్లు వాళ్ళను ఏడవనియ్. మన కెందుకు?"

"అలాగే లే."

"మళ్ళీ నీభర్త సినిమానుంచి వచ్చే వేళయింది. ఏదీ... "

"భయ మేముంది? వీధి తలుపు కొడితే దొడ్డి తలుపు తీసి నిశ్శబ్దం వేయనూ?"

"దొడ్డితలుపే కొడితే?"

"వీధి తలుపు."

"మార్గాలన్నీ ఆలోచించే ఉంచావన్నమాట."

"కాకపోతే సుశీలలా బయట పడతా ననుకున్నావా?"

"అబ్బే—కాని సునీ—సుశీల సంగతి అందరికీ తెలుసంటావా?"

"లోకం కోడై కూస్తుంటే."

"సరే. ఆకోడి కూసేలోపున—ఏ—దీ."

"అబ్బ! ఏం తొందరా బాబూ—"

"తొందర కాదు మరి—చాటు వ్యాపారంలో లేటు చెయ్య కూడదన్నారు."

"ఓహో."

వారు కాముకకృత్యాలలో కన్నులు మిన్నులు కానడం లేదు...

వారి సంభాషణంతా పూర్తిగా కిటికీ పక్కనుంచి విన్న సుధీర్ హృదయం చితికిపోయింది; అతని రెండు కన్నులూ ఎవరో ఇనుప శూలాలతో పైకి పెగిలిస్తున్నట్టుంది; లోకం నలువంక చూచి పకపకా విరగబడి నవ్వుతున్నట్టయింది.

"సుశీల రం—కు—టా—లా!"

అతని తలలో వేయిసర్పాలు మెలికలు తిరిగాయి.

"సురేశ్ ద్రో—హీ!"

అతని కన్నులలో చితాగ్నులు రగిలి పోయాయి.

"పాప నా—కూ—తు—రు—కా—దూ!"

అతని హృదయంలో వేయి ఎముకలు నాటబడ్డాయి.

పతివ్రతనని మోసం చేసిన ఈమహాకులటను నాశనం చేసి తీరతాను... పాపాయి ప్రాణాలు తీసి తీరతాను...ఆ పాపపు సంతానం నాకన్నుల యందు కలియుగ పిశాచంలా కదులుతూ ఉండగలదా!"

అతని హృదయంలోని పచ్చినెత్తురు దోసిళ్ళ తాగుతున్నాయి ఘోర భయంకర అనుమాన పిశాచాలు.

* * *

అతడు ప్రళయరుద్రుడిలా మేడెక్కాడు. పాపాయిని పక్కలో పడుకోబెట్టుకొని, "కన్నతల్లి" కలత లెరుగని నిదురలో కన్నుమూసింది.

ఆ తల్లీపిల్లలను చూచాడు. తెల్లతాచు తన పక్కలో తాచుపిల్లను పెట్టుకొని పండుకున్నట్టుంది. వారిద్దరినీ ఒకేసారి గొంతుకులు పిసికి చంపివేదా మనుకున్నాడు.

కాని ఇద్దరిని ఒకేసారి చంపడం ఎలా? మొదలు పాపానికి కారణం అయిన పాపాయి ప్రాణాలు తీసివేద్దా మనుకున్నాడు.

తన ఇనుప చేతులతో... నాటి వరకు అల్లారు ముద్దుగా పెంచిన— పాపాయి గొంతుకు పిసకబోయాడు...

కనులు చెదిరి పోయాయి చేతులు వణికి పోయాయి.

కాని తనను పూర్తిగా ఆవరించిన అనుమాన పిశాచం "చంపు. చంపు. ఊ. ఆలోచించక. చంపు" అంటూ అతనిని హెచ్చరిస్తూ ఉంది.

వెంటనే పాపాయి గొంతుకు నులమబోయాడు.

పాపాయి కాళ్ళు గిలగిలా కొట్టుకుంది.

వెంటనే సుశీల లేచింది. ఆ లైటు వెలుగులో పాపాయిని చంపబోతున్న సుధీర్‌ని చూచింది. ఆమె కన్నుల నామే నమ్మలేకపోయింది.

"ఎవరది?"

"నే .. నే..."

"సుధీర్."

"అవును."

"ఏం చేస్తున్నావ్."

"పాపాయి ప్రాణాలు తీసివేస్తున్నాను"

"పా...పా...యి...ప్రాణాలే."

"అవును. పాపాయి ప్రాణాలు ఈ వేళతోసరి."

"సరా!"

"అంతేగాదు...నీ ప్రాణాలు కూడా."

"నాప్రాణాలు కూడానా?"

"తప్పకుండా..."

"సుధీర్! ఏవేనా మాట్లాడుతూంది?"

"అవును. నేనే."

"ఏం చేశావని?"

"రంకుపని."

"రం...కు...ప...నా?"

"ఓసి కులటా! ఏంవంగనాచివే?"

"రం...కు...ప...నా?"

"ఛీ, నోర్మూయ్. ఏపనో మరోక్షణంలో యమునితో చెప్పు."

ఆమాటతో ఆమెకు కోపం అగలేదు.

కన్నులెఱ్ఱచేసి పాపాయి నెత్తుకొని లేచింది.

"సుధీర్...నీ చేతులతోటేనా పాపాయిని చంపబోయింది?"

"అవును. నా చేతులతోటే."

"నీవు కన్నతండ్రివేనా?"

"కాదు... నే నెలాగౌతాను? సురేశ్."

"సు...రే...శా?"

"నీకే తెలుసును—"

"సుధీర్—నీవు మనిషివేనా?"

"అయితే ఈఘోర కృత్యాలు చేయగలనా? పతిమాటున ఈపాపపు సంతానాన్ని కనగలనా?"

"పాపపు సంతానమా? మీరు పుణ్యాత్ములా? నేను రంకుటాలనా? ఇలా మాట్లాడే మీవంటి మహాత్ములేనా శిశువధ స్త్రీవధా చేసేది?"

"తప్పక—" అంటూ అతడు పాపాయి గొంతుకుమీద చెయి వేయ బోయాడు, ఒక సర్పాన్ని తోసివేసి నట్లామె తోసివేసింది.

"సుధీర్...అనుమానంకంటే మహావిషం మరొకటి ఉండదు. నీకు అనుమానం ఉంటే నన్ను ముక్కలు ముక్కలు చేయి...ఫరవాలేదు...ఇది నీశరీరం, దీనిని నీయిష్టం వచ్చినట్లు చేసుకుంటావ్...అడిగేనా రెవరు?

కాని—ఒక ప్రార్థన

విజ్ఞానివి; విద్యావినయ సంపన్నుడవు; వెనుకా ముందూ ఆలోచించ కుండా మనల్ని మనం మరచి పోయి ఏపని త్వర గా చేయ వద్దని ప్రార్థన. నీవు ఏపని చేసేముందైనా రెండుమూడు సార్లు ఆలోచించు. తరువాత చెయ్."

"చిత్తం...చాలులే నీ శ్రీరంగనీతులు"

"చాలునా...చాలు మరి...నా జీవితమే నీకు చాలు...నీ అనుమానాగ్నిలో హారతికర్పూరంలా 'హారతి' అయిపోయిన నాజీవితాన్ని తిరిగి చూడలేవు సుమా సుధీర్"

"తెలుసును"

"నేను రంకుటాలను కాదని...నాకు వ్యవధియిస్తే—నీచేతే రుజువు చేయించ గలను"

"అవసరం లేదు... నాకు తెలుసును"

"పొరబడుతున్నావు సుధీర్... పొరబడుతున్నావ్... ఆ భగవంతుణ్ణి ముఖంచూచి చెబుతున్నాను_ నేను పతివ్రతనే సుమా!

"కాదు: ఎన్నటికీ కాదు"

"కాదని రుజువు చేయగలవా?"

"చేయగలను కాని___చేయవలసిన అవసరం నాకు లేదు"

"మరి నీకు అవసరం ఏమిటి?"

"నీప్రాణాలు___నీపాపాయి ప్రాణాలు తీసివేయడం"

సుశీలకు మతి పోయినట్లయింది. ఆమె వెఱ్ఱిగా నవ్వుతూ

"సుధీర్... ప్రాణాలు తీసే కసాయివాని వయ్యావా? మంచిది. తీసేయ్... నీకత్తిని నా మెడ మీద పూలదండలా వేసేయ్. నా మంగళ సూత్రం మీద రండురక్తపు బొట్లులు కుంకమబొట్లుల్లా చిందనియ్...ఊఁ... ఆలోచించక... పతి హృదయంలో శూలమైన సతి జీవించే దానికంటే చస్తే మేలు"

అతడు వెఱ్ఱివానివలె ఆమెవంక చూస్తున్నాడు.

"సుధీర్___నీ పవిత్రపాదాలకు అంకితం చేసిన నా జీవిత ప్రేమ గ్రంథంలో ప్రతిపుటా నీదే___ప్రతివాక్యం నీదే, ప్రతి అక్షరం నీదే___ సుధీర్!___నాజీవిత గ్రంథాన్ని దిక్కుల చివరకు విసరి వేసినా సరే___కాలి క్రిందవేసి నలిపి వేసినా సరే రక్తంకారేటట్లు పుటలు___హృదయపుటభేదంగా చించివేసి, అక్షరాలు రక్తంలో ముంచివేసినా సరే!

నీ యిష్టం___ నీ ఆనందం___"

రెండు కాష్ఠాల్లాగ మండి పోతున్న ఆమెకనులలో మృత్యు విషసర్ప ఫణామండలం మీద మణులకాంతి - వెలిగి పోతూఉంది.

బండి చక్రాలలా కదలి పోతున్న ఆమెకనుల వెనుక కదలి పోతున్న ప్రపంచాలు అతడ్ని ఆహుతి చేస్తున్నట్లున్నాయ్.

అలాగే నరకబడిన మ్రోడు మ్రానులాగై పోయాడు.

ఆమె చూచింది: జాలి చెందింది

"సుధీర్! ఈపాపిని చంపటానికే నీచేతులు వణుకుతుంటే - పాప పుణ్యాలెరుగని పాపాయి నెలా చంపగలవు?"

సుధీర్! ఆకాశంవంక ఎగరబోయే చిన్ని గాలి పడగను చింపివేయడానికి ఇనుపకత్తెరలు కావాలా? కొనగోరు మొనలు చాలవూ? వాననీటి కాలువలో పారే కాగితపు పడవను ముంచివేయడానికి పర్వతాలే అడ్డు రావాలా?—చిన్న మట్టిబెడ్డ చాలదూ? సుధీర్! వాసనలేని అడవిపూవును తుంచి రేకులు కాల్చివేయడానికి వేయిహస్తాలు కావాలా? ఒక్క పసిబాలహస్తం చాలదూ?—హేమనికుంజంలో పెరిగే చిన్ని మల్లెలతను తుంచివేయడానికి ఏనుగుహస్తమే కావాలా? ఎలుకలతోకలు చాలవూ? మాట్లాడవేం? మౌన మెందుకు సుధీర్."

ఆమె కన్నులలో అలముకొన్న విషాదమేఘాలు కన్నీటి వర్షాన్ని కురిపించాయి—తల దాచుకుంటానికి గొడుగైనా లేని సుధీర్ ఆకన్నీటి వర్షంలో తడిసిపోయాడు గడగడా వణికి పోతున్నాడు. ఇప్పుడే యిల్లాలి హృదయంవిప్పి కప్పుతుంది? ఏయిల్లాలు ప్రేమాగ్నితో చలికాస్తుంది?

సతికి పతే—గృహం.

పతికి సతే—దీపం.

గృహంలేని దీపం ఆరిపోతుంది.

దీపంలేని గృహం చీకటిలో మునిగిపోతుంది.

కాబట్టే పతికి సతే గతి; సతికి పతే గతి.

* * *

"సుశీ! ఎన్ని చెప్పినా నీవు పతివ్రత వంటే ఈ జన్మలో నమ్మలేను."

"పాపం."

"నాకనులతో నీ పాపపు సంతానాన్ని చూడలేను."

"సరే."

"అందుచే రేపు నేను తెచ్చిన విషాన్ని పాలల్లో కలిపి పట్టేయ్యి దానితో మన తగవు లాఖరు."

ఆమె కొయ్యబారిపోయింది.

"వి—ష...మా?"

"అ—వు—ను!"

"పా—పా—యి—కా?"

"అ—వు—ను!"

ఆమె హృదయం రాయైపోయింది; మెదడు బండబారిపోయింది.

"మాతృత్వం తెలియని నీమాటలు వినడానికే లోకం సిగ్గుపడుతుంది. ఇక మాట్లాడకు "కన్నతల్లి" బిడ్డకష్టాలు సహించలేదు; కన్నీరు గాంచలేదు; ప్రాణాలు తీస్తుందా? పాలుకుడప డానికి బదులు విషం కుడుపుతుందా? పిచ్చి వాడా? కన్నతల్లి పాపాయిప్రాణాలు తీయదు; ప్రాణాలు ఇస్తుంది. విషం పట్టదు; అమృతం పడుతుంది."

"అలాగా."

"ఎలాగో నీకు తెలియదులే సుధీర్! అనుమాన పిశాచం ఆవరించిన నీకనులతో కలియుగ చిత్రనాటకాన్ని చూడలేవు; కాని నాటకంలో ఒక కసాయివానిపాత్ర వేయగలవు?"

"సంతోషించాం?"

"సంతోషించక విచారిస్తే-మధురమైనహృదయపాత్రను అమృతంతో నింపేబదులు హాలాహలంతో నింపుతావా? పూలపొదను చేసేబదులు కసాయి వానికత్తులపొదిని చేస్తావా?"

"విషం పట్టనా?"

"ఏకన్నతల్లీ బిడ్డలప్రాణాలు తీసే మృత్యుదేవత కాలేదు"

"పట్టవు?"

"సుధీర్! నా ప్రాణాలు తీసివేయ్—భయంలేదు—నా తరువాత నాభగవంతుడే నాపాపాయిని రక్షించగలడు—స్వర్గధామంలోనుంచి నా చిట్టితల్లి నోట నేనే అమృతపువాన కురిపించగలను—సుధీర్—ఆలో జించక ఈ పాపిని త్వరగా చంపు"

"—చం—పా—లా?"

"ఊ—"

"————"

"వెఱ్ఱివాడా! నీవు చంపలేవ్—నీచేతకాదు—పతివ్రత ప్రాణాలు తీయడానికి మృత్యువాస్తాలే గజగజలాడిపోతూ, వినయాంజలి పట్టి ఎదుట నిలుస్తాయి తెలిసిందా?— ఆ విషం ఇలా తే—నేనే ఆనందంగా తీసు కుంటాను—"

"నీవంటిపాపిని చంపేదానికంటే—కారడవిలో ఘాతుకమృగాలకు

బలిచేస్తేమంచిది—కులటా—నీపాపపు సంతానంతో నాయింట్లోనుంచి పో.

"పోతాను—మాచిట్టితల్లితో నే పోతాను—పోవటానికి నాకు విచారంలేదు కాని "కులట" నని పించుకొని వెళ్ళుతున్నానే అని విచారంగా ఉంది.

సుధీర్! బ్రతికుంటే నీచే నేను పతివ్రత ననిపించగలను

సత్యం స్వర్గంలో వెలిగే ఆరిపోనిదీపం.

దాని నెవరూ తగ్గించ లేరు; ఆర్పలేరు. దాని వెలుగులో ఏనాడో ఒకనాడైనా నాజీవిత గ్రంథం నీవు చదవగలవు. పవిత్రతా ముద్రితమైన ప్రతిఅక్షరం నీకు ఆనందం కలిగించ గలదు. కాని—అందాక శాంతి—విశ్రాంతులకు దూరమై పోతున్నానే అని విచారం నాహృదయంలో నాటని మేకైంది."

"మంచిది. ఇక వెళ్ళు."

"ఇవిగో—నీ నగలు."

"అవసరం లేదు. తీసుకుపో. పాపిశరీరాన్నున్న బంగారం కూడా అపవిత్రమైనదే."

"పాపినా?—మంచిది—సర్పాలలా మెదులుతున్న ఈ నగలను నా మెడలో ఉంచలేను. నీకు యిష్టం లేకపోతే భిక్షుకులకు ఇచ్చివేయ్."

ఆమె నగలన్నీ అతని పాదాలమీద వైచింది. పిల్ల నెత్తుకుంది—భక్తితో పతిపాదాలకు నమస్కరించింది.

"సుధీర్—సెలవు—నేను పాపిని కాను. పతివ్రతనే. సెలవు!" అతని పాదాలపైన రెండుకన్నీటి పుష్పాలుజల్లి తుదిపూజ చేసి, పతిసెలవు తీసుకొని ఆ "కన్నతల్లి" బయలుదేరింది. పాపం. కారడవుల్లోకో—కాలసముద్రంలోకో? ఎవ్వ రెరుగుదు రీశ్వరాజ్ఞ? ఆమె వెనుకే తలుపు వేయబడింది—అంతే.

౩

ఆ అర్థరాత్రి పాపాయి నెత్తుకొని ఇంట్లోనుంచి వెళ్ళిపోతున్న కన్నతల్లిని చూచారు, సుబ్బయ్యా సునీతలు.

"సునీతా! పాపం సుశీలను ఇంటినుంచి గెంటివేసినట్లున్నాడే"

"అవును పాపము! అన్యాయంగా ఆడిపోసిన మాట లన్నీ సుధీర్ విన్నాడేమో!"

"విసే ఇంట్లోనుంచి గెంటివేసి ఉంటా డనుకుంటాను."

"రామ, రామ, ఎంత పాపం నడికట్టుకున్నాను"

"ఏం? ఆమె సురేశ్ తో వ్యభిచరించలేదా?"

"ఛా, ఛా! వా ళ్ళిద్దరూ అన్నాచెల్లెల్లాగ ఉండేవారు"

"మరి అలా చెప్పావే"

"నల్ల అద్దాలతో లోకాన్ని చూస్తే ఎలా గుంటుంది? లోకం అంతా అలాగే నల్లగా కనబడుతుంది. నాపాపపు కన్నులతో చూస్తే పతివ్రతలు రంకుటాళ్ళాగ కనబడరూ!"

"ఎంతపని చేశావ్—నారికాపరానికి నిప్పు పెట్టావే"

"నిప్పేమిటి? మహాపతివ్రత పాపిష్ఠా లుంటారూ? ఆమె చనిపోతే నాపాపం నన్ను కట్టికుడపదూ? ఏకుష్ఠురోగినో అయిపోనూ?"

"అబ్బో! అప్పు డసలు చూడలేను నేను."

"ఇప్పు డేమిటి కర్తవ్యం?"

"ఆమెను పిలుచుకొచ్చి భర్తపాదాలమీదపడి నిజం చెప్పటమే."

"సుశీలకూ నాకూ ఉండేస్నేహంచేత అలా చెప్పించిం దనుకుంటాడేమో!"

"ఏమీ అనుకోడు. సత్యం జయించలేని దీ ప్రపంచంలో లేదు."

"అయితే నీవు వెళ్ళి పిలుచుకురా!"

"ఇంకానయం. ఏగాడీ ముండాకొడుకనో అనుకొని, చెడతిడితే ఏంచెయ్యను?"

"సరే! నీవు ఇక్కడే ఉండు. నేనే వెళ్ళి వస్తాను."

"ఈలోపుగా మీ అయ నొస్తే."

"ఇంకా పన్నెండన్నా కాందే"

"ఏమోలే...ఆనందంలో టయిము తెలీదు"

"ఉందూ..."

"సరే వెళ్ళు"

సునీత వీధిగుమ్మంతలుపు తీసి గడప దాటింది; రెండు మెట్లు దిగింది; అంతలో ఆమె భర్త సుందరం ఎదురుగా ప్రత్యక్షం అయ్యాడు సినిమా నుంచి.

"సునీతా—"

"ఎవరు?—మీ—రా?"

"ఏం అలా ఖంగారు పడుతున్నావ్"

"మీరేనా అని"

"కనబడడం లేదూ?"

"అప్పుడే ఎలా వచ్చారు?"

"వెధవ సినీమా ఏమీ బాగుండలేదు... పైగా నీవు జ్ఞాపకం వచ్చేసరికి మనసు రెపరెప లాడింది—"

"దానితో వచ్చేశారా?"

"రాకుండా ఉంటానికి నాతరమా? అయితే ఇలాఎక్కడకు బయలు దేరావ్."

"మీకోసమే."

"ఎందుకూ? నీకు నేను జ్ఞాపకం వచ్చానా?"

"జ్ఞాపకం రావడం ఏమిటి? ఎప్పుడూ నాహృదయంలోనే ఉంటారు."

"నాకు తెలీదూ? నీవు "పతివ్రత" వని తెలిసే పొరుగూరు వెళ్లినా తెల్లతరబడీ రాను."

"అలాగే మరి."

"ఇంతకూ ఇలా ఎందుకు వస్తున్నావ్?"

"మా అన్నయ్య వచ్చాడు. మీరింకా రావడం లేదేమో,ఎవరిచేతైనా కబురు పంపుదామని చూస్తున్నాను—ఎందుకంటే మళ్ళీ ఇప్పుడే వెళ్ళి పోతాడట."

"ఎవరు సూర్యమేనా?"

"అబ్బే! మా పెత్తండ్రి కొడుకండి."

"ఓహో! సుబ్బారావా?"

"అబ్బా! మీరు చూడండే.

"నేను చూడ పోవడం ఏమిటి నీ తలకాయ. వెధవ సెమీ[బ్రేక్]లా మాట్లాడతా వేమిటి?"

"చిన్నప్పుడే రంగూన్ పారిపోయాడండీ!"

“అలా చెప్పు పట్టి దొంగముండాకొడుకన్న మాట”

“నిమ్మళంగా అనండి వింటాడు. వ్యాపారం నిమిత్తం వెళ్ళాడండీ”

“పేకాట వ్యాపారమా? కల్లు వ్యాపారమా?”

“బావగారంటే మీ కంత వేళాకోళంగా ఉంది”

“కాదు మరీ”

ఇద్దరూ లోపలకు వెళ్ళారు. కస్తూరి సువాసనలతో పేలిపోతున్నాడు సుబ్బయ్య. సుందరాన్ని చూచి పైప్రాణాలు పైనే విడిచివేయబోయాడు. కాని సునీత కనుసన్న చేయటం వల్ల ప్రాణాలతో నిలబడ్డాడు.

“అన్నయ్యా! ఇదిగో మీ బావమరది గారు?” అంటూ నవ్వుతూ చెప్పింది.

“ఓహో! మీరేనా? చాలా ఆనందం”

“మీరు చిన్నప్పుడే రంగూన్ వ్యాపారం నిమిత్తం వెళ్ళారన్న మాట’ అంటూ సుందరం కళ్ళజోడు పైకెత్తి చూస్తూ ప్రశ్నించాడు.

“చెప్పాను కదూ!” అంటూ సునీత జవాబుచెప్పింది.

బ్రతుకు జీవుడా అనుకున్నాడు సుబ్బయ్య

“మీ రెంత సేపయింది వచ్చి?”

“మీరటు సినిమాకు వెళ్ళారా! అంతలో వచ్చాడు.”

“అంతే ..అంతే.”

“మీ కేదో యీ ఇల్లు కొత్తగా ఉన్నట్లుంది. బెదిరిపోతున్నారు.”

“అంతే—అంతే.”

“ఖంగారు పడకండి. నా ఇల్లే మీ యిల్లు.”

“అంతే—అంతే.”

“నాకు మీ రొకటి – మీ చెల్లెలొకటీ కాదు.”

“అంతే—అంతే”

“మీరీ రాత్రికి ఉండి రేపు వెళ్ళకూడదూ?”

“వీల్లేదని చెప్పామని. చెప్పాను కదండీ. వారికి అర్జంటు పని ఉంది”

“అంతే—అంతే”

“సరే—ఫలహారాలు పెట్టావా?”

“లేందే—”

"బాగుంది—అయితే తీసుకొస్తానుండు"

"ఇప్పు డెక్కడుంటాయ్"

"సినిమాకి వెళ్ళయ్య లేదుకదూ—"

"సరే—వెళ్ళిరండి"

"రండి—బావగారు—ఇద్దరం వెళ్ళివద్దాం"

"మీరు వెళ్ళివదురూ—అన్నయ్యా కూడా ఎందుకు?"

"సరే—ఇప్పుడే వస్తా"

అంటూ సుందరం వెళ్ళిపోయాడు, ఏమీ ఆలోచించకుండా. సునీత వీధితలుపు వేసివచ్చింది.

"ఆ అమ్మవార్యే రక్షించావ్ బాబు"

"ఆఁ! ఇదొకటేమిటి—అయినా నీ బొందలా అన్నిటికి "అంతే—అంతే" ఏమిటి?"

"ఏం చెయ్యను—గుండె గొంతుకలో అడ్డుపడితే—"

"బాగా చెప్పావు గాని—మా ఆయన రాగానే ఫలహారాలవీ పూటుగాతిని, ఊరు వెళుతున్నట్లు చెప్పి కాలికి బుద్ధిచెప్పు"

"స్టేషనుకు వస్తానని వెంటబడితే"

"నేనువున్నానుగా—విడుస్తానూ?"

"బలేదానవులే—మా పెద్ద చెయ్యి. మళ్ళీ ఎప్పుడో"

"ఎప్పుడో ఏముంది—మీ బావగారు ఏజంటులే. ఇంటిపద్దుం దేవి నెలకు రెండు రోజులే"

"అలా చెప్పు. అందుచేతే పాపం ఈ కక్కుర్తి"

"పోదూ—నెపవ వేళాకోళం నువ్వూను"

అంటుంటే సుందరం వచ్చాడు సుబ్బయ్య గుండె లాగిపోయాయి. మెహూత్రం జంకలేదు—ఇటువంటి వెన్ని మాచిందో!

"ఏం వచ్చారు?"

"ఫలహారాలు మోసుకు రావడానికి బుట్ట మరచిపోయా?"

"అలా చెప్పండి" అంటూ లోపలకు వెళ్ళి బుట్ట తీసుకొచ్చిఇచ్చింది. అత డాత్రంతో వెళ్ళిపోయాడు.

"సునీతా—మనబ్రతుకు బండలయ్యేరోజు వచ్చింది."

"ఏం భయంలేదు — నే నున్నానుగా"

"ఏమున్నావో — ప్రాణాలు పైనే పోతున్నాయ్"

"కొత్తలో అలాగే ఉంటుంది."

"ఏం ఉంటుందో — గుండె తుప్పుపట్టిన గడియారం లాగ కొట్టు కుంటుంది. ఆగిపోయే టట్టుంది"

"ఓస్ — ఈ మాత్రం దానికేనా — ఇంతకూ మగవాళ్ళది పట్టి మేకపోతు గాంభీర్యం"

"ఏమో — గాని నేను."

"తెలుస్తుందిలే. అంచేతే నీలాంటి బ్రాహ్మలు పప్పు మాని, కైమా ఉండలు దంచాలని చెబుతున్నాను."

"ఏదో — సహవాసఫలితంవల్ల త్వరగా అబ్బితేనేగాని రాటు తేరేటట్టు లేను — చూడు శరీరం వణుకుతుంది. ఇలా వచ్చి కొంచెం పట్టుకో, గుండెదడ తగ్గడం లేదు."

ఆమె వెళ్ళి బిగ్గిగా దొక దెబ్బకొట్టి గట్టిగా కౌగిలించుకుంది. వారి నీడ కిటికీలో నుంచి చూచాడు సుందరం. తలుపు కొట్టాడు. ఆమె నవ్వుతూ వెళ్ళి తలుపు తీసింది.

"ఏమిటే సునీతా...చాలా కాలానికి చూడడం వల్లేమిటి కౌగిలించుకొని విడువలే పోతున్నారు."

"అవునుమరి. అందుకే ఇప్పుడే వెళ్ళిపోతున్నాడు."

"అంతే. అంతే."

"మా అన్నయ్యా నేనూ ఒక్కక్షణం విడచి ఉండేవాళ్ళం కాదు. ఒక్కకంచంలో తింటూ - ఒకమంచం మీద పండుకునే వాళ్ళం,"

"అంతే — అంతే"

"పాపం."

"రాక రాకవచ్చి, చూడండి నాలుగు రోజులైనా ఉండకుండా వెళ్ళిపోతాడుట."

"అవునుమరి. అవతల అర్జెంటు పనుంటే ఏంచేస్తాడు?"

"ఏంపనో లెండి. నా భ్రమ తీరొద్దూ?"

"ఏంచేస్తావ్. మీ ఆడవాళ్ళకు మగవాళ్ళ అవస్థలు తెలియవు. రేపు

నేనుమాత్రం వెళ్లవద్దు?"

"మీ రిద్దరూ ఇలాగ నెల తరవున ఉంటే నే నుండలేను సుమండీ! ఏనుయ్యో గొయ్యో చూసుకోవలసి వస్తుంది." అంటూ కన్నీరు మున్నీరుగా ఏడవడం ప్రారంభించింది. ఆమెను ఓదార్చలేక చచ్చారా ఇద్దరు మగ పశువులు__ఆ కాలవనుండి ఇలాదాటించిం దా ప్రియుని. ఇలా ఎంతమంది ప్రియులను దాటించిందో ఎవరికి తెలుసును?

*　　　*　　　*

ఇటువంటి రెండుతలల బండ మొండిరండ శిఖండులవల్లే కదా, పవిత్రమైన సంసారాలు బుగ్గిపాలౌతున్నాయి. ఆ కాముకి తన సంసారాన్నే కాక ఎదట సుబ్బయ్య సంసారాన్నికూడా కూల్చివేస్తుంది. అంతేకాదు మహాపతివ్రత అయిన సుశీలకాపరానికి కూడా నిప్పుపెట్టింది. ఆకాముకి కామాగ్నిలో ప్రపంచమే దగ్ధమై పోతుంది.

ఇంతకూ ఆలోచిస్తే తప్పంతా ఆమెదేనా? ఎన్నటికీ కాదు. నడి యౌవనంలో ఉన్న స్త్రీని ఒంటరిగా విడిచి నెలల తరవున పతి పరస్త్రీ కౌగిలిలో ప్రపంచాన్ని మరచి పోతే ఆమె ఏంచేస్తుంది? ఆమెకు మాత్రం హృదయం లేదూ? కామంలేదూ? మోహం లేదూ? వానిచేతులలో ఆమె అతనివలె కీలుబొమ్మ కాదూ? ఆమెబండరాయికాదు, ప్రపంచ వ్యామోహానికి గురికాక పోవడానికి__ఇలాగన్నానని ఆమెను వ్యభిచారం చేయమనీ లేదు. నేను చెప్పేదేమిటంటే ఆపాపాగ్నిలో సతీపతు లిద్దరి శరీరాలు కట్టెలై కాలవలసిందే. ఆపాపానికి ఇద్దరూ బాధ్యులే అంటాను."

## ౬

ఆ అర్ధరాత్రి__గాలికి కూలిపోయే పండుటాకులాగ సుశీల తూలి పోతూ వెళ్ళిపోతూ ఉంది "భగవంతుడా! ఇంత విశాల ప్రపంచం అంతా నాకు ఇరుకై పోతుందే__ఎక్కడ తలదాచుకోను, నాయనా? ఈ అగాధ ప్రపంచంలో నా అశ్రుపాత్రి ఎక్కడ దాచుకో గలను తండ్రీ! ఈ మహా సముద్రంలో ఏ కెరటం మాటున నా జీవిత గ్రంథం దాచుకో గలను ప్రభూ!" అనుకుంటూ ఆ అభాగ్యజీవి అశ్రుపాత్రితో అగాధ ప్రపంచంలో ఆశ్రయంకోరకు అల్లాడి పోతూ ఉంది.

*　　*　　*　　*

రాత్రి రెండు గంటలు కొట్టారు. పాపాయి నెత్తుకొని శ్మశానం వైపు వెళ్ళిపోతూ ఉందామె. ఆమె వెంటే ఒక పోలీస్ కాన్‌స్టేబుల్ వెళుతున్నాడు. ఆమెను సమీపించాడు,

"ఏయ్—ఎవరు మీరు?

"——————"

"మాట్లాడరేం?"

"——————"

చేతిలో లైటు పైకెత్తి ఆమె ముఖం చూచాడు. ఆ తేజో స్త్రీమూర్తిని ముగ్ధుని జేశాయ్. అతి డాశ్చర్యచకితుడై పోయాడు.

"అమ్మా! మీ రెవరు?

"నేనా? నే నొక అభాగినిని"

"ఇలా ఎక్కడకు?"

"ప్రపంచపు టంచుల చివరకు—ఆ కనపడే వెలుగుల్లోకి."

"అవి మండుచున్న కాష్టాలు తల్లీ! అది శ్మశానం."

"తెలుసును—ఆ మంటల్లోకే."

"ఎందు కమ్మా!"

"మండే హృదయాన్ని ఆమంటల్లో కలపడానికి"

ఆమె మాట్లాడకుండా వెళుతూ ఉంది. భుజంమీద పాపాయి కదిలింది. కానిస్టేబిల్ సుబ్రమణ్యం హృదయం జల్లుమంది.

"అమ్మా! మీకు ఇల్లు లేదా?"

"ఉంది?"

"ఎక్కడ?"

"ఇక్కడే—ఇదే...నాయనా! అభాగినులకు ఆకాశమే ఇల్లు."

"మీచరిత్ర చూస్తుంటే నాహృదయం కరిగి పోతూంది."

"హృదయం ఉంటే కరగకేం జేస్తుంది?"

"అమ్మా! మీభర్తగా రెక్కడున్నారు?"

"ఊహా ప్రపంచంలో."

"చెల్లీ—"

ఆమె ఆపిలుపుకు ఆశ్చర్యపోయింది. ఆమెజీవితంలో అంతతీయగా

పిలిచిన వారిని చూడలేదు. అందులో ఒంటిపాటుగా ఉన్న స్త్రీని "చెల్లీ!" అనిపిలిచే సహృదయు లెవరు?

"చెల్లీ? ఈ మీ అన్నయ్య బ్రతికి ఉండగా నీ కేమీ భయంలేదు... మా యింటికిరా తల్లీ!"

"బాబూ! భగవంతుడే తన హృదయ మందిరం తలుపులు వేసేశాడు. ఆయన హృదయ మంధిరంలో నా కింక తావు లేదట...అయింట ఈ పాపి నిలువరాదట."

"చెల్లీ! ఏ దీనస్థితి చూస్తుంటే భగవంతుని హృదయం పర్వతం కావచ్చును...కాని ఈ దీనునిహృదయం మహాసముద్రం అయిపోతూంది;"

"అన్నయ్యా!"

"చెల్లి! నా కింకెవరూ లేరు...రా...పేదలే పేదలకు ఆశ్రయం ఈయగలరుగాని పేదలకు గొప్పవాళ్లు ఆశ్రయం ఈయలేరు. కారణం దరిద్రంలో ఉండే బాధ వాళ్ళకు తెలీదులే చెల్లి!"

"అవునన్నయ్యా! అవును...కాని ఈపాపిని కాలగర్భంలో కలసిపోనియ్...ప్రశాంతిగా ఉన్న నీజీవితాన్ని నేను భగ్నం చేయలేను."

"నీవు వచ్చినా ప్రశాంతి కేం భగ్నం అమ్మా! నాహృదయంలో వేయి చేతులతో దీవిస్తున్న శాంతిదేవతగుండె మీద ఎవరూ శూలం నాటలేరు... రా తల్లి...రా!"

ఆమె ఇంకేమీ మాట్లాడలేక అతనివెంటే బయలుదేరింది. సుబ్రహ్మణ్యం తన పాతింటికి ఆకన్నతల్లిని తీసుకొని బయలుదేరాడు ... ఇద్దరూ ఇల్లు చేరారు.

* * * *

ఆయింట్లో సుబ్రహ్మణ్యం...సుబ్రమణ్యం తల్లిమాత్రం ఉంటున్నారు. అతడు పేదవా డవటంచేత పెళ్ళిచేసుకో కూడ దనుకున్నాడు...

సుబ్రహ్మణ్యం సుశీలను తల్లికి తెలియజేశాడు. తల్లికి అపరిమితమైన ఆనందం కలిగింది. కన్నకూతురులేనిలోటు తీరుస్తుందనుకుంది.

* * * *

సురేశ్ ఆఫోటోలన్నీ తీసుకొని ఏదోఊరు వెళ్ళాడట. అతని అంతు తెలియలేదు...సుధీర్ విశ్రాంతికోరకు ఊటీ వెళ్ళాడు... సుబ్రహ్మణ్యానికి

రెండు నెల లయింతరువాత రాజమండ్రి బదిలీ అయ్యింది. తల్లితోటి - సుశీలా పిల్లలతోటీ బయలుదేరి వెళ్ళిపోయాడు.

ఒక నెల గడిచింది తగిలినగోరుకే దెబ్బ తగులుతుం దన్నట్లు పేద వారికే ఆపద లెక్కువ వస్తాయ్; సుబ్రమణ్యానికి భయంకరమైన పక్షవాతం వచ్చి ఒక చెయి పడిపోయింది...కాలుకూడా కొద్దిగా వంకరపోయింది దానితో అతని ఉద్యోగం పోయింది...

"చె...ల్లి!"

"అన్నయ్యా!"

ఆమెవంక చూశాడు...దుఃఖం ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడ్వడం ప్రారంభించాడు...చంటిపిల్లవానిలాగ ఆమె వడిలో తలపెట్టుకొని గావురు మని ఏడ్చాడు...ఆమెకూ కన్నీరు ఆగలేదు...

"ఊరుకో అన్నయ్యా! ఊరుకో!"

"ఏం పాపం చేశానో చెల్లి! ఈమహారోగానికి గురిఅయ్యాను."

"పాపం ఏముందన్నయ్యా! మంచులో రాత్రిళ్లు తెల్లవార్లూ తిరుగుతూ ఉండేవాడవు...ఇంటికివచ్చింతరువాత కడుపునిండా, పడిన కష్టానికి తిండేది?"

"పోలీసు లంతా తిరగలేదా చెల్లి!"

"అంతా వల్లోంచి తెల్లవార్లూ తిరుగుతారా? నాలుగు రోడ్లూ తిరిగి ఏకొట్టు, బల్లమీనో ఏచెరువు గట్టునో ఎక్కడో పండుకొనే వాళ్ళను ఎంత మందిని మనం చూడలేదు."

"అయితే నా తప్పేనంటావా?"

"తప్పేముంది? నీపని నీవు ఏమరకుండా చేశావ్. కాని కష్టానికి తగి నంత సమువాయం లేక ఇలా మనవంటి వాళ్ళెంత మందో - ఎన్నో విచిత్రమైన జబ్బులకు బలి అయిపోతున్నారు."

"ఇప్పుడు నాగతేమిటి చెల్లీ—పని పోవలసిందే కాదా?"

"పోలీసుపని లేని వాళ్ళంతా జీవించడం లేదా అన్నయ్యా!"

"ఇంకేం చెయ్యగలను?"

"ఏమీ చెయ్యొద్దు...నీకు నేనున్నాను. మనకు భగవంతుడున్నాడు."

"నీ వేం చెయ్యగలవు? సుకుమారి బిడ్డవు?"

"సావిత్రి దమయంతులకే కష్టాలు తప్పలేదు. ఇక మన లెక్కేమిటి? అయినా అన్నయ్యా బాధపడితే నేగాని జీవితం విశ్వసౌందర్యాన్ని తొంగి చూడలేదు." అంటుంటే సుబ్రమణ్యం తల్లి వచ్చింది...ఆమె ఏడుపుకు అంతే లేదు. ఆ యిల్లొక కన్నీటి కాలువై పోయింది. సుశీలే వాళ్ళకు ధైర్యం చెప్పే వేదమూర్తి అయి పోయింది.

* * *

సుశీల ఒక డాక్టరు గారిని తీసుకు వచ్చింది.

ఆయనేదో ఇంజక్షన్ ఇచ్చి - బ్రాంది ఇమ్మన్నాడు; పావురాయి రక్తం పూయమన్నాడు. వెళ్ళిపోయాడు. జబ్బు త్వరలోనే తగ్గవచ్చునన్నాడు. కాని బ్రాందికి డబ్బేది? సుశీల హృదయం చివికి నలిగిపోయింది. సుబ్రమణ్యం ఆమెవంక దీనంగా చూశాడు. అతని విషాద వదనం ఆమె చూడలేక తల మరోప్రక్కకు తిప్పివేసింది. నీరునిండిన ఆమెకనులు అతనికి చూపించలేక పోయింది...—వంటింట్లోకి వెళ్ళి పోయింది. నేలమీద చదికిలబడిపోయింది. మోకాళ్ళలో తలపెట్టి ఎక్కెక్కి ఏడ్వడం ప్రారంభించింది - అంతలో ఆమె మెళ్ళో మెరుపులా మెరిసిపోయింది మంగళసూత్రం.

ఆమె కన్నులానందముతో వికసించాయి.

"నాపతే నాహృదయంలో ఉన్నాడు...ఇదెందుకు? ఆనవాలు కొరకు పసుపుకొమ్ము కట్టుకోరాదూ? మా అన్నయ్య ప్రాణాలకంటే ఎక్కువా?"

మంగళసూత్రాన్ని అమ్మి, కావలసిన సామానులను తీసుకురావాలను దృఢ సంకల్పంలోకి వచ్చివేసింది. లేచింది...బజారుకు వెళ్ళింది...

* * *

"అమ్మా చెల్లమ్మేది?"

"ఎక్కడకో వెళ్ళింది బాబు."

"పాపం! మనయిలాన ఎంత అవస్థ పడుతుందో?"

"అవునుమరి"

"నిప్పు తినకుంటే తానే మండకుండా..లోకాన్నంతా మండిస్తుంది. సహవాసదోషం ఊరకే పోతుందా!"

"ఇలాగే."

"అమ్మా! ఆపాపాయి నాడించు."

"అమ్మా! చెల్లమ్మ ఇంకా రాలేదూ?"

"వచ్చింది— ఇదిగో...మీ చెల్లమ్మ." అంటూ రెండు బ్రాందీ బోటిల్సు - కస్తూరి, మొదలైనవన్నీ తీసుకొని సుశీల సుబ్రిమణ్యం ఎదురుగుండా నిలబడింది.

సుబ్రిమణ్యం కనులముందు వేయివేల సుశీలలు తిరుగుతు న్నట్లయింది. అతని వేయి వేలగుండె లొక్క—సారిగా నాదబ్రిహ్మను వెలువరించాయి.

"చెల్లి! ఎక్క—డి వివి?"

"బజారులోవి?"

"డబ్బో?!"

"మనకు డబ్బుకు లోటేమి టన్నయ్యా! నీవు పుచ్చుకో ... నీజబ్బు నయం కావాలే కాని మనకు కోవలసిం దేముంది?" అంటూ సుశీల గ్లాసులో బ్రాందీ పోస్తూఉంది...ఆమె మంగళసూత్రింమీద అతని అను మానరేఖలు విరిశాయి."

"చెల్లి...మం...గ...ళ సూత్రిం ఏదీ?"

"మార్వాడీ కొట్టులో ఉంది."

"అమ్మేశావా?"

"ఒక్క—దెబ్బలో"

"ఎంతకని చేశావు చెల్లి."

"మరేమీ ఫరవాలేదు. దానిగురించి ఆలోచించక."

అతని కనులలో దరిద్రిదేవత శవాలను తగులబెడు తున్నట్లుంది. ఏమీ మాట్లాడలేక అతడు బ్రాందీ పుచ్చుకొని కళ్ళు మూసుకున్నాడు— సుశీల ఆనందంతో లోపలకు వెళ్ళింది. చిట్టి తల్లిని ఎత్తుకుంది.

"చిట్టీ—మావయ్యకు జబ్బు చేసింది. చూచావా?"

"ఊ—హా"

"చూచావా—మాతల్లి వే—మావయ్య కాళ్ళు పిసుకుతావా?"

"పి—సు—తా—"

"అమ్మా! మా బంగారు తల్లివే—ఏవీ మావయ్యపాదాలు పిసికే బంగారపు చేతులు—"

"ఇ—యి—గో"

అంటూ పాపాయి తనరెండు చేతులనూ చూపింది. కన్నతల్లికష్టాలన్నీ చిట్టితల్లి చిరునవ్వుల్లో చెరిగి పోయాయి. సుశీల పాపాయి నాడిస్తూ పెరట్లోకి వెళ్ళింది. పాపం! ఆమెకు భరించలేని కష్టం కలిగి నప్పుడల్లా పాపాయిబంగా రపుపాదాలను ముద్దుపెట్టుకుంటూ–మూడులోకాల ఆనందాన్ని చూరగొంటూ ఉంటుంది. పాపాయి ఎప్పుడన్నా "నాన్నా — నాన్నా" అనిఏడిచిందంటే నిలువు నిలువునా నీరై పోతుంది—"వస్తాడమ్మా! నాన్నవస్తాడు—నీకు అన్నీ తెస్తాడు." అంటూ ఓదారుస్తుంది.

అపుడపుడు ఆమె పూర్వ జీవితాన్ని తలుచుకొంటూ, అంతర్బాష్పాల చేత కాలిపోయేహృదయాన్ని చల్లబరచుకుంటూ ఉంటుంది. ఏమిటో భాగిని లోకవంచిత.

* * *

౨

కాలరథ చక్రాలక్రింద అభాగినులు చిదికి పోతున్నారు. వారి రొమ్ముకలనుంచి చిమ్మన గొట్టం క్రింద ఎగజిమ్మిన రక్తపుజల్లు, రథచక్రాలను అంటుకు పోతూంది. ఆ రక్తచందనాన్ని ఏ గంగా జలంతో కడిగి వేస్తాడో భగవానుడు.

ఆమె అనాధ హస్తం అశ్రుపాత్రి ధరించి అన్నపూర్ణ అమృత భిక్షకు ఎదురు చూచింది...అంతే... ఆకలి కడుపులో రేగు అగ్నిజ్వాలకు అన్నపూర్ణ ఎప్పుడు ఆహుతై పోయిందో—పాడడని దేవాలయం మాత్రం మిగిలింది.

"అగ్ని వర్షం!
అగ్ని వర్షం!
అనాధజీవుల ఆహుతిజేసే
అగ్ని వర్షం!
అగ్ని వర్షం!

* * *

అశ్రుధారలు!
అశ్రుధారలు!
అభాగ్య జీవుల ఆయువు తీసే

అశ్రుధారలు !
అశ్రుధారలు !
*　　　*　　　*

విష జ్వాలలు !
విష జ్వాలలు!
విశ్వజీవులను భస్మంచేసే
విష జ్వాలలు !
విష జ్వాలలు !
*　　　*　　　*

విదగ్ధ హృదయం !
విదగ్ధ హృదయం !
వేడినెత్తురూ పీల్చివేసే
విదగ్ధ హృదయం !
విదగ్ధ హృదయం !
*　　　*　　　*

కత్తిపోటులా
నెత్తుటి మంటలు——
శ్మశాన భూముల భస్మంచేసే
కత్తిపోటులా
నెత్తుటి మంటలు..."
*　　　*　　　*

ఈ పాట మన అభాగ్యజీవి సుశీల హృదయంలో ఎవరో వేయి గొంగురు గొంతుకులతో పాడుతున్నారు...సముద్రపుఘోషలా మారు మ్రోగుతున్న ఆ పాటను వింటూ, కళ్లాబు జల్లుతుంది. డాక్టర్ సురేందుని ఇంటి ముందు_కళ్లాబు జల్లిన తరువాత ముగ్గులు పెడుతూంది;

"సుశీలా__ఇంకా ముగ్గుల్లోనే ఉన్నావా?"
"అయిపోయిం దమ్మ గారు—
"ఏం అయి పోయింది? అంట్లుతప్పాలాలింకా ఎప్పుడు తోవుతావ్"
"ఇప్పుడేనమ్మా !"

"త్వరగా తెములు్చ—మన్ను తిన్నపాములాగ, ఏపని చేస్తుంటే ఆ పని వద్దే ఉండిపోతావేమిటి?"

"వస్తున్నా నమ్మా!"

"త్వరగా రా! అయ్యాగారికి కాఫీటయిము అవడంలేదూ?"

"చిత్తం—చిత్తం—"

సుశీల గజ గజ లాడుతూ, అంట్లుతోముతూంది. సురేంద్రుని భార్య సుబ్బమ్మ మృత్యుదేవతకు పెద్దక్కగారు; బ్రహ్మరాక్షసికి చిన్నక్కగారు: ఆమెను చూస్తే నాలు వీధంతా హడలే—తాటకిలా ఎంతో అందంగా ఉంటుంది భర్త కనులకు.

సుశీల అంట్లన్నీ త్వరత్వరగా తోమి సుబ్బమ్మగారికి అందజేసింది. కొంతసేపటికి వారి కాఫీలయ్యాయ్—ఎంగిలి గ్లాసులు బయట పడేస్తే మళ్లీ తోముతూఉంది.

సుబ్బయ్యగారి ఏకైక పుత్రిక సూరమ్మ వచ్చింది.

"సుశీలా! ఏంతోమడం నీముఖం లాగ— ఎక్కడ జిడ్డు అక్కడే ఉంది"

"ఇకనుంచి బాగాసే తోముతానండి"

"నీకు మహాపొగరెక్కిందిలే—ఆ చింతపండు అంతంత ఒక్కొగ్లాసుకు పట్టిస్తున్నావేమిటి?—అసలే యుద్ధపు రోజుల్లో చింతపండు దొరక్క మేం చస్తుంటే నీ వేమిటి?

"ఇకనుంచి మట్టితోసే తోముతానమ్మా!"

"ఏదో ఏడువ్—త్వరగా—"

సుశీల పనులు త్వరగా చేస్తున్నా సుబ్బమ్మగారి కూతురు సూరమ్మ గారు ఆస లూరుకుంటంలేదు. తల్లికంటే నాలుగాకులు ఎక్కువ చదువు కుందీమె. ఆమె భూలోకాన్ని మింగుతానంటే—ఈమె మూడులోకాలను మింగుతా నంటుంది.

పగలు పదిగంటలయింది.

"సుశీలా! సుశీలా."

"అమ్మా! అమ్మా!"

ఆమె పరుగెత్తుకొనివెళ్లింది.

"స్నానాల గదిలో నా కోకలున్నాయ్—అవన్నీ పిండి ఆరవేశావా?"

"లేదమ్మా?"

"ఏం చేస్తున్నావ్."

"బాబుగారి బట్టలుతుకుతున్నానండి"

"అఘోరించ పోయావ్"

"———"

"త్వరగా బట్టలన్నీ పిండి...మాగది బూజులు దులిపి మరీయింటికి వెళ్ళు."

"అలాగేనమ్మా!"

పాపం! సుశీల యింటెడు పనులూ వంచిన నడుము ఎత్తకుండా ఆకలి కడుపుతో చేస్తూఉంది—ఇంటివారు పంచభక్ష్య పరమాన్నాలు తింటున్నా పాచిపని చేసే సుశీలకు ఒక్క గుక్కెడు కాఫీకూడా ఇచ్చిన పాపాన్న పోలేదు.

మధ్యాహ్నం ఒంటిగంటయింది అందరి భోజనాలూ అయ్యాయి - మిగిలిన పులుసు అన్నం సుశీల గిన్నెలో వేశారు. ఆమె యెంతో భక్తితో గిన్నెపై పైటముసుగువేసి యింటికి, ఆయెండలో తలమాడి పోతూఉంటే, కాళ్ళు కాలిపోతూంటే, వెళ్ళింది ఆహా! ఏమిటీ కాలవైపరీత్యం! పదుగురిచే సేవలు చేయించుకొను సుశీల ఇప్పుడు పదుగురకు సేవలు చేస్తూ ఉంది.

"అవును...నిజం—అలాగే—చిట్టితల్లీ" అంటూ ఏమిటేమిటో మధ్యమధ్యన పిచ్చిదాన్లా అనుకుంటూఉంటుంది. అసలు సుశీలను చూచినవాళ్ళెవరూ సుశీలను పోల్చుకోలేరు.

ఆమె ఇప్పుడు తల నెరిసిన ముసిలిపండు. జవశక్తులుడిగిన అశక్త, తిండికిలేని పేదరాలు. పనిచేసుకొని బ్రతికే దాసీ.

* * *

సుశీల ఇంటికి వెళ్ళేసరికి పాపాయి గుమ్మం పట్టుకొని తల్లికోసం ఎదురు చూస్తూవుంది. పాపాయిని చూడగానే "కన్నతల్లి" హృదయం పాలసముద్రంలా పొంగిపోయింది...తల్లిని చూచిన పాపాయి కన్నులలో ఆనందరేఖలు వెల్లివిరిశాయి,

"అమ్మో..త్తి...ంది...అమ్మో...త్తింది." అంటూ గుమ్మం పట్టుకొని లోపలకు పారిపోయింది.

"అమ్మదొంగా! పారిపోతున్నావా" అంటుంటే చిట్టితల్లి చిరునవ్వు మంచి ముత్యాలు కురిపిస్తూ, తప్పటడుగులు వేస్తూ పారిపోయింది. ఆనందంతో సుశీల ఆమెను "దొంగా...ఎక్కడకు పారిపోతావింక" అంటూ ఎత్తుకుంది.

ఆతల్లీ బిడ్డలనవ్వుముఖాలు చూచిన సుబ్రిమణ్యం కన్నులలో నవ వసంతం వికసించింది. సుశీల లోపలకు వెళుతూ__

"అన్నయ్యా! మా దొంగముండ ఎంతఅల్లరిదై పోతూందో చూడు.

"అల్లరి పిల్లలకే లీడర్."

"ఏమే...చిట్టీ...అల్లరి దానవా?"

"నీ...వే."

"నేనా పైగాను."

"నీవే."

అంతా నవ్వుకున్నారు.

"చిట్టీ. ఏదీ మావయ్యకు దణ్ణంపెట్టు."

"ఇ...దో..."

చిట్టి పాలబుగ్గల్లో పసినిమ్మపండు కాంతులు ఒలకపోసుకుంటూ నవ్వుతూ చేతులెత్తి నమస్కారం చేసింది.

"ఏందణ్ణమే—వంకరదణ్ణమూ నవ్వాను"

"మావకు వంకరదణ్ణం కాకపోతే__తిన్నగా చేస్తుందా? ఏంతల్లీ"

"ఊ__" అంటూ తలూపింది.

చిట్టిని ముద్దుపెట్టుకుంటూ లోపలికి వెళ్ళి "చిట్టీ—మామ్మకు దణ్ణం పెట్టు" అని మామ్మను చూపింది

"ఇ—దో__" అని మళ్ళీ నమస్కరించి సిగ్గుతో తల, కన్నతల్లి పయిట చెంగులో దాచి వేసుకుంది.

సుశీల పాపాయి నెత్తుకు మరోచోటికి వెళ్ళింది. అలాపగలు పడ్డ కష్టం - అధికారులచే అనుభవించిన దీవెనలు, మంత్రపుష్పాలు పాపాయి చిరునవ్వు పెదవులు పెట్టుకుంటూ మరచి పోతూఉండే—నిజానికి పిల్లలకంటే తల్లులకు కావలసిందేముంది? తల్లులకు పిల్లలే ఆనందకల్పవల్లులు.

* *

ఏదో కలోగంతో తాగి సుశీల పనిలోకి బయలుదేరింది. పిల్లను విడిచి ఒక్క తుణం ఉండలేనిది, పగలు పగలల్లా పనిపాటల్లో ఉండవలసి వచ్చింది.

సుశీల డాక్టరుగారి ఇల్లు ఊడుస్తూ ఉంది. ప్రళయ శక్తిలా వచ్చింది సుబ్బమ్మ తల్లి

"ఏం సుశీలా ఇవాళ ఇంత ఆలస్యం అయింది"

"ఆలస్యం అయిందాండీ!"

"ఇంకా "అ...యిం...దాండీ" అంటూ సాగతీసు కుంటున్నావ్?

"——"

"మాట్లాడవే"

"రేపు త్వరగానే వస్తానండీ—?

"సరే—వేడినీళ్ళు స్నానానికి కాగేయో లేదో చూడు, చిన్నమ్మగారు తలంటి పోసుకుంటారట"

"అలాగే నమ్మ—"అంటూ చీపురు మూలపెట్టి లేవబోయింది.

"అదేమిటి? అంతా ఊడ్చి వెళ్ళమంటే—అబ్బే! ఇంత తెలివి తక్కువ పక్షితో ఎలా వేగడమో అర్థంకావడం లేదు.

"————"

"ఊఁ—ఊడ్చూ! అలాగుడ్లగూబిలా చూస్తావేం? వెధవముండకు మా పొగ రెక్కువైంది" అంటూ ఏమోమో సణుక్కుంటూ లోపలకు వెళ్ళి పోయింది.

సుశీల అన్నిగదు లూడ్చి, అంట్లుతోమి, నీళ్లు కాస్తూఉంది—పచ్చి పుల్లలవల్ల పొయిమండక బాధపడుతూంటే అది శక్తికి అపరావతారంలా సూరమ్మ ప్రత్యక్షం అయి—

"ఏం సుశీలా! ఇంకా నీళ్ళు కాచలేదూ?" అంటూ నిప్పులవర్షం కురి పించింది.

"కాగుతూన్నాయమ్మ! పుల్లలు మండడం లేదు"

"మంట పెట్టటం చేత కాకపోతేసరి?"

"మావిడిపుల్లకదమ్మా—పొగమాత్రం వస్తూంది."

"ఓహోహో! "తమ రిక్కడ పనిచేస్తున్నారని" టేకుపుల్ల తెప్పిస్తాం"

"అంతకోపం ఎందుకమ్మా! మంటపెడుతుంటే"

"ఓసి నీ సాగరు మండ...నాకే బుద్ధి చెబుతున్నావ్...తిన్న ఇంటి వాసాలు లెక్కెట్టె జాతికదూ మీది."

"క్షమించండమ్మా!"

"ఏడిశావు గాని...త్వరగా కాయి...ఇవాళ చాలా పనుంది...ఊ... త్వరగా..."

"అలాగేనమ్మా! అలాగే—"

ఆమె అంతలో పొయి బాగా మంటపెడుతూ ఉంది.

చూశారా ఆ అభాగిని జీవితం క్షుత్తు మంట చల్లార్చుకోవాలంటే ఈ దరిద్రబానిస భారత దేశంలో ఎంతకష్టపడాలి, ఎన్ని కన్నీళ్ళు కార్చాలి, ఎన్ని నిందలకు గురికావాలి. ఆలోచించండి—

* * *

సాయంకాలం ఆరుగంటలయింది. పళ్ళుఫలహారాలు పాలూ వెండి పళ్ళెంలో పెట్టుకొని మేడమీదకు సుబ్బమ్మగారు సూరమ్మగారికి తీసుకు వెళ్ళమంటే సుశీల తీసుకు వెళుతూంది..

సూరమ్మ తలారా స్నానం చేసి సాంబ్రాణి ధూపంతో తల ఆరుపుకొని అభినవరతీదేవిలా తయారయింది. ఆమె వాలుజడలో, కీలుకొల్పిన సన్నజాజులు గదంతా ఘుమ ఘుమ లాడిస్తున్నాయ్. ఆమె ఎందుకో ఆరోజున అపరిమితానంద మహాసముద్రంలో పూలపడవపైన తేలిపోతూంది. అవలతీరాన్న వెలిగే ప్రియుని హస్తస్పర్శకో!

ఆమె తండ్రిగారు మెడ్రాసు వెళ్ళారు. నాలుగు రోజుల వరకూ రారట. దానితో ఆయింటికి ఆమే పెత్తందారయి స్వర్గంక్రింద చేసేస్తుంది.

* * *

సుశీల వెండిపళ్ళెం తీసుకొని మేడమెట్లెక్కుతూంది. ఎవరో ఇద్దరూ నవ్వుకుంటూ ఉన్నట్లుంది.

ఆమె హృదయం ఎందుకో నేలమీద రాలిపోతున్న రావాకు గాలిలో కొట్టుకుపోతున్నట్లు కొట్టుకుపోయింది. గదినిండా సువాసనలు గదిలో మధుర అభిభాషణలు. ఆమెకేమీతోయ లేదు. కింపకు వెళ్ళిపోదామనుకుంది. కాని క్రిందకు వెళితే "ఏం? ఎందుకు ఫలహారాలు తీసుకు వెళ్ళి అమ్మాయికివ్వలేదు." అని రాక్షసిలా సుబ్బమ్మ మీద పడుతుందేమో నని భయం కలిగింది, ముందు నుయ్యి. వెనుక గొయ్యి.

ఏమీతోచక మేడమెట్లెక్కింది. గదిముందు నిలబడింది. అంతే— ఆమె శరీరం వేయివిషసర్పాలు కబళిస్తూ ఉన్నట్లు తోచింది. గజగజలా

పోయింది. సురతి గారి ప్రియుడైన కంపౌండర్ సుబ్బయ్య తన నూతన ప్రియురాలైన నూకమ్మను బిగికౌగిలిలో లాక్కున్నాడు మన్మథుడు తాళం వేశాడేమో అన్నట్లు వారిరువురి మధురాధరాలు ఒకటిగా కలిసి పోయాయి. ఆపాపపు దృశ్యం కనులారా చూచిన సుశీల చేతులు వణికి పోయాయి; శరీరం జవజవ లాడిపోయింది. కనులు తిరిగి పోయాయి. గాబరాతో చేతిలోని పళ్లెం జారిపోయింది, "ధన్" మని పడిపోయింది.

పాపం! వారి కాముక పిశాచం భంగారు పడిపోయింది. వారిబిగి కౌగిలి సడలిపోయింది సుబ్బమ్మేమో అనుకొని వారు హడలిపోయారు. కాని సుశీల అవడంచేత వారి హృదయాలు తేరుకున్నాయి. నూకమ్మ కోపం ఆగలేదు.

"ఏంముండా? ఎవరు రమ్మన్నా రిప్పుడు!"

"అమ్మగారు వెళ్ళమన్నారు"

"అమ్మగారా—వచ్చేటప్పుడు కేక వేసి రావద్దూ!"

"తెలీదమ్మా—"

"అయితే ఆ వెండి పళ్ళెం కిందపడేశావేం? కళ్లు భయర్లు కమ్మాయా"

"అవునమ్మా!"

"ఏం పయిత్యమా?"

"— —"

"ఏంరోగం?"

"— — —"

"చేతులు పట్టులు తప్పిపోవడానికి ఏమన్నా పక్షవాతమా!"

"అంత అదృష్టమాలిల్లి—పక్షవాతమే వస్తే ఈపాపపు కృత్యాలు చూస్తానా!"

నూకమ్మ ఆశ్చర్యపోయిం దా మాటకు

ఇద్దరూ రెండునిమిషాలు ఏమీ మాట్లాడుకోలేపోయారు. పలహారాలు తీసి పళ్ళెంలో పెడుతూఉంది సుశీల. సుబ్బయ్య ఏదో కనుసన్న చేశాడు.

దానితో నూకమ్మ నెమ్మదిగా సుశీల చెవులో.

"సుశీలా! ఈ సంగతి ఎవరికీచెప్పకే—నిన్ను కని పెడుతూ ఉంటా సుమీ" అని నెమ్మదిగా అన్నది.

"అమ్మా! ఇటువంటి కాముక దృశ్యాలు చూడడానికే నాకన్నులకు శక్తిలేకపోయింది; ఇటువంటి విషయాలు ఇతరులతో చెప్పడానికి నానాలుక కెక్కి ఎలావస్తుంది?"

"ఇంతకూ చెప్పవుకదా?"

"పేదల కెందుకమ్మా పెన్నిధులవిషయాలు" అంటూసుశీలవిసుగుదలతో మేడమెట్లు దిగిపోయింది.

ఆరోజావ కొంచెం త్వరగా ఇంటికి జేరింది.

*　　*　　*

పాపాయి నెత్తుకొని గుమ్మంవద్ద సుబ్రమణ్యాం తల్లి నిలబడింది. సుశీల ఏమీ మాట్లాడకుండా పాపాయి నెత్తుకొని లోపలకు వెళ్ళి పోయింది.

ఆమె కనులనీరు జారుతూఉంది. పాపాయి లేత చేతులతో తుడిచింది. కన్నతల్లివంక జాలిగా జూచింది! సుశీల హృదయం ముక్కలు ముక్కలై పోయింది.

"చిట్టీ" నీకన్నీళ్ళు నేనూ—నాకన్నీళ్ళు నీవేనా తుడవడం! మీనాన్నకు దయ ఇకరాదా చిట్టీ! మనదరిద్ర జీవితాలను తుడిచివేయడానికి అన్నపూర్ణ హస్తం ఎక్కడుందమ్మా?...సత్యానికింక జయమే లేదా? స్వర్గవీథుల్లోని వెలుగులు తొలిగి పోయాయా?

ఆమె వెక్కి వెక్కి ఏడ్వడం ప్రారంభించింది.. గడచిన తనజీవితాన్ని చూస్తున్న కన్నులు కన్నీటి వరదలై పోయాయి.

*　　*　　*

అది దీపంలేని చీకటి కొంప— కర్మదేవత తన పయిటచెంగుతో దీపాన్ని ఆరిపివేసిందేమో!

ఆయింట్లో ఊటీనుంచి తిరిపగివచ్చిన సుధీర్ చేతులలో తలపెట్టుకొని కూర్చున్నాడు.

"అమ్మా! నాన్న ఏడీ!" అంటూ పాపాయి తల్లి నడుగుతూవుంది.

తల్లి మాట్లాడలేక కన్నీళ్ళు నించుతూంది.

"అమ్మా! నాన్న...నా...దూ!"

అని పాపాయి నేర్పుతో తల్లిగడ్డం తన వైపుకు తిప్పుకుంటూ అడిగింది.

జవా బేమీ చెప్పలేక "వస్తాడమ్మా! వస్తాడు." అంటూ అక్కడనుంచి మరొక చోటుకు తీసుకు పోయింది.

* * *

"సురేశ్ ! ఇవన్నీ సుశీల చిత్రాలే !"

"అవును"

"అన్నీ సుశీలవే తీశావే!"

"ఆమెకంటే రసజ్ఞురాలు - అనురాగ హృదయిని - పతివ్రతా నా కెవరూ కనుపించలేదు."

"అయితే ఇన్నిఫోటో లెందుకు?"

"వీటివల్ల భారత స్త్రీ ఏకాకిగా ఉన్నప్పుడు చేయ వలసిన దినచర్య తెలుస్తుంది—చూడు ఈ పసిబిడ్డ నెత్తుకున్న చిత్రం, దీనికింద ఏమి వ్రాసుందో! చూడు. "భారత స్త్రీ జన్మ మాతృత్వమునందే సాఫల్యము పొందును" అని- చూస్తున్నావా?"

"చూస్తున్నా"

* * *

ఆవిధంగా అతనికి తల్లిని తండ్రిగురించి పిల్ల అడుగుతున్నట్లు— సురేశ్ ఆమెకంటే "పతివ్రత" లేదని చెబుతున్నట్లు—వింతవింత దృశ్యాలు కన్నుల యెదుట కదలి పోతున్నాయ్. అతని తలలో మృత్యుమంథిరాన్ని ఎవరో రిపెయిర్ చేస్తున్నట్లుంది. కోపంతో అక్కడనుంచి లేచాడు.

"పతివ్రతట...పతివ్రత...పైకంతా పతివ్రతలే. కడుపులో మాత్రం కాముక విషసర్పాలు కదులుతూఉంటాయి.———ప్రాణానికి ప్రాణంగా నమ్మి సురేశ్ ఎంతపని చేశాడు? ఎవరిని ఇంక నమ్మడం, ఈ విధవ ప్రపంచములో...అంతా కుచ్చితపుసర్పాలే; విషపుచ్చాలే"

అనుకుంటూ ఆ చీకటిలోనే తన గదిలోనికి వెళ్ళిపోయాడు. మంచం మీద పండుకున్నాడు. సుశీల ఫోటో వెన్నెల వెలుగులో తళతళా మెరిసింది. ఆ ఫోటోలో ఆమె మాట్లాడుతున్నట్లుంది.

"నేను పతివ్రతనని రుజువు చేయగలను." అన్నది.

అతడు ఉలుక్కిపడ్డాడు.

"అనుమానాగ్నికంటే మహావిషం మరొకటి ఉండదు."

అతడు గజగజలాడి పోయాడు.

"సుధీర్! ఈపాపిని చంపటానికే నీ చేతులు వణుకుతుంటే—పాప పుణ్యా లెరుగని పాపాయి నెలా చంపగలవు?"

"చంపానా" అంటూ అతడు గడగడ వణికిపోయాడు.

"సుధీర్! ఆకాశంవంక ఎగిరిపోయే చిన్ని గాలి పటాన్ని చింపివేయ డానికి ఇనుపకత్తెరలు కావాలా? కొనగోరు మొనలు చాలవూ?"

ఆమాటలాతని హృదయాన్ని చీల్చేగునపపుపోటు లయ్యాయి.

"కన్నతల్లి బిడ్డల కష్టాలు సహించలేదు."

"అవునవును" అతడు మంచంమీద నిలవలేక పోయాడు.

"సుధీర్! బ్రతికుంటే నీ చేతే నేను పతివ్రతననిపించగలను."

"అనిపించవ్" అంటూ ఫోటోవద్దకు వెళ్ళి పోయాడు.

"సత్యం స్వర్గంలో వెలిగే ఆరిపోని దీపం!"

"కాదు - కాదు - స్వర్గంలేదు—నరకంలేదు—నీవు కులటవే—ధూర్తురాలవే—పతివ్రతవుకావు—కాదు—కాదు—కాదు" అంటూ ఫోటోను చేత్తో గట్టిగా గుద్దివేశాడు. దానితో అది బద్దలై పోయింది. చెయ్యి రక్తపు కొల్లయి పోయింది.

"పిచ్చివాడవు కాక సుధీర్!" అని వేయిగొంతుకలతో సుశీల అన్నట్లయింది. దానితో అక్కడ ఒకక్షణం ఉండలేక పోయాడు—అన్నితలుపులు తీసుకుంటూ బయటకు వచ్చేశాడు—తీసిన తలుపులు వేయనైనా వేయలేదు. వెంటనే బయటకు బయలుదేరి వెళ్ళిపోయాడు. వెఱ్ఱివానిలా. ఎంతదూరం? ఎక్కడకు?

అర్ధరాత్రిలు ముఖ్యంగా ఆలోచనలు పదును కుంటానికి వీలైనవి. అతడు పిచ్చివాడై పోయాడు.—ఎక్కడికో అలా వెఱ్ఱివానివలె వెళ్ళి పోయాడు. పాపం! హృదయం శిథిలం అయితే, బ్రతుకు బరువుకాదూ?

* * *

నెలరోజులు గడిచాయి.

సుధీర్ గృహం శుభవసంతంగా కలకలలాడుతూఉంది. పచ్చతోరణం

నిత్యశోభనం: ఆనందం – అనురాగం; [illegible]ఒంట్లో ఓలలాడుతున్నా[illegible]

సుశీలను మరచిపోలేక పోతే అ[illegible]బ్రతుకు బరువులు మో[illegible]లేక పోయాడు. అతని శిధిల హృదయంలో సుధ[illegible]పై నిదుర పోతేనే గాని విశ్రాంతి లభించదనుకున్నాడు.

లత పెరగాలే గాని ప్రక్కనే దుంటే దానినే ఆలంబనంగా చేసుకొని అల్లుకు పోదూ; ఆకాశాన్ని అంటుకు పోదూ; తారకా కుసుమాలను పూసుకుపోదూ; ఏమంటారు?

అనుక్షణం అతని అడుగులను కన్నీటిచే కడిగివేస్తున్న సునీతి యెడల సుధీరునకు ఆదరాభిమానాలు ఎక్కువయ్యాయ్. ఆమె భర్తకూడా యింట్లో లేడేమో పాపం! ఎవరి సేవో ఒకరిసేవ చేస్తూ ఉండాలి కాబట్టి, ఆపతివ్రతామతల్లి సుధీర్ సేవ చేస్తూఉంది. ఎందుకంటే "మానవసేవే మాధవ సేవ కదండీ! అందుచేత

అతని వీధిముందు కామధేనువు; దాని నుండి పాలబ్రాందీ పిండుతున్నాడు. అతని పెరట్లో కల్పతరువు; దానినుండి మధురాధరామృతాన్ని పీల్చివేస్తున్నాడు.. ఆలాగుంది మరి సుధీర్ జీవితం. అటు ధనరాసులు జిమ్మివేస్తున్నాడు;

ఇటు సునీత యౌవన మధువు పీల్చివేస్తున్నాడు.

* * *

సంవత్సరం గడిచింది చేయి చాస్తే అందుతుంది బ్రాందీ బోటిల్ పిలుస్తే పలుకుతుంది సునీత. అతనికి శోకం లేదు. ఆమెకు భర్త లేడు. ఆనందమే ఆనందం.

ఒకనాటి సాయంకాలం బ్రాందీ గ్లాసులో పోస్తూఉంది సునీత.

"సునీ...ఇంకా పొయ్"

"చాలు సుధీర్..."

"పోయమంటే పొయ్...ఫ్లాటయ్...పో...వాట్—పడవ"

"ఎక్కువై పోతే గొడ్డు లాగు పడుకుండి పోతావ్"

"అందుకే తాగేది"

"అయితే ఆనందం అనుభవించే దెప్పుడు?"

"అప్పుడే..."

“నిద్రలో ఆనందంఏమిటి? చచ్చినవాడు నిద్రపోయినవాడూ ఒకటే”

“మంచిది—పాయ్—చచ్చినవాడినే... నే...ను”

“నేనూ పొయ్యాను బాబూ!”

అవగలమారిచిన్నది నర్సుగంతో సయ్యాటలు మాని పయ్యట సవరించుకుంటూ శయ్యాగృహంలోకి వెళ్ళింది.

“ఆవుతోటిది కాదోకో అంబోతు” అన్నట్టు ఆమె నెవక పద్దానా కాముక చరిత్ర. కామం మానవులను కూడా పశువులను చేస్తుంది కదా! పశువువలె బుద్ధిలేనపుడే కదా పాడు పనులు చేసేది? ఇంకొకా మానవుల నాశనానికి కారణం ఈ కామం కదా! ఆ కాముకులలా కిందా మీదా పడుతున్నారు! వాళ్ళే పశువులయితే - ఆ పశు కృత్యాలను వర్ణించే నాకు మరీ పశువులు కావా! అంచేత నేను పరిహారించను; ఎందుకన్నా వర్ణిస్తే మీరు చదవనూ వద్దు ..ఎందుకంటే మనం అందరం వంశపు కలిగిన మనుష్యులగా పుట్టాం. మనుష్యులు చేయవలసి పనులే చేద్దాం...మనుష్యులగానే చనిపోదాం. ఏమంటారు? మనుష్యుల్లా పుట్టి - పశుకృత్యాలు చేసి—పశువుల్లా ఎలా చనిపోతాం ..

అంచేత ఆ చీకటి కొట్టులో - ఆ మోహజ్వాలల్లో - ఆ కాముకుల కాష్టాలు రెండు భగభగా మండిపోయ్యాయండి; మాడి మసికానియ్యండి; ఆ మసినే ఆదిశివుడు విభూతి రేఖలుగా ధరించనీయుండి; ఎవ్వడి కెక్కడ?

* * *

తెల్లవారింది. ఇడ్లెను తిని కాఫీ తాగుతున్నారా నూతనప్రియులు.

“సునీతా! పాపం సుశీల ఏమయిందో!”

“ఇంకా తెలీదూ?”

“ఎవరు చెప్పారు?”

“నీవస లెవరినడిగావ్”

“ఎవరికి తెలుసు నని ఎవర నడగను?”

“అదేమిటి—? ఆ సంగతి అందరకు తెలుసును?”

“ఏమైంది?”

“ఏమి చెప్పను పాపం—”

“ఏం— చెప్పు సునీ! ఎక్కడుంది?”

"ఇంకెక్కడుంది___? ఈ లోకం విడిచి చాలా కాలమైంది?"

"నిజం"

అతడు ఉలిక్కిపడి లేచాడు

"అంత ఖంగారెందుకు సుధీర్?___అటువంటి రంకుటాలు భార్యగా ఉండి నీకీర్తిని పాడు చేసే దానికంటే చస్తే మేలు కదూ?

"నిజ — నిజం"

"పోనిద్దూ—నేనున్నానుగా—నీకేం లోటు జేస్తున్నాను."

"నిజం—నిజమే—"

"మళ్ళీ ఏదో ఆలోచనల్లో పడ్డావేమిటి?"

"అబ్బే! ఏమీ లేదు గాని. పాపాయి ఏమైందా అని ఆలోచిస్తున్నాను"

"పాపాయికేం___ఎవరికో భోగంవాళ్ళకు అమ్మివేసిందట___"

"అలా చెప్పు—మొత్తానికీ తల్లిలా పిల్లకూడా పెద్దయితే కొలువు సాగిస్తుందనుకుంటాను"

"తప్పకుండా___ఏనాడైనా చిలుక ఆపలుకే పలుకుతుంది"

"చచ్చినవాళ్ళు చావనే చచ్చారు___మన కెందుగ్గాని, ఏదీ ఆ బ్రాందీ బోటిలు—"

"ఇప్పుడేగా కాఫీ తాగింది?"

"ఆగొట్టం వేరు—ఈగొట్టం వేరు"

"చాల్లే ఊరుకుందూ!"

"పూర్తిగా తాగేస్తే ఊరుకోకేం జేస్తాను?"

"సంతోషించాంలే!"

"నా తెలివికి నీవూ___నీ తెలివికి నేనూ సంతోషించకపోతే, మన తెలివి తేటలు ఎవరు మెచ్చుకోనుసు?

"ఏం?"

"భర్తను విడిచి నీవూ - భార్యను విడిచి నేనూ- వహ్వా !" ఏం దాంపత్యంరా బాబు మనది"

"పోనీలే నీకంత కష్టంగా ఉంటే వెళ్ళిపోతాను" అంటూ ఆమె మూతి తిప్పుకుంటూ___పర్వతాలవంటి పిరుదులు - రోలింగ్ బండల్లా తిరిగి పోతూ ఉంటే వెళ్ళబోయింది.

ఆమె చెయిపట్టుకొని బ్రతిమిలాడుతూ "నుం! నీవు వెళితే బ్రతుకగలనా? ఆ బ్రాందీ బుడ్డితో నాతల పగలగొట్టేసి వెళ్ళిపో!"

"ఇంకా నయం!"

"హాస్యానికంటే ఇంత ఆర్భాటం ఎందుకూ?

"అయితే సరే!"

"లేకపోతే—అన్నయ్యా! అంటూ ఇదివరలో వచ్చేదానవు—ఆహా ప్రియా! అంటూ ఇప్పుడు వస్తావా!"

"అదిగో దెప్పుతున్నావ్!"

"ఛా—ఛా—నతోడు—నీకు నాకున్న ప్రేమ అద్వితీయం—అనన్యం—అద్భుతం—అకాశం—అని చెబుతున్నాను"

"ఏంగోల చేస్తావు లెద్దూ!"

"నా బ్రాందీనాకు ప్రసాదిస్తే ఈ గొడవలుంటాయా?"

ఆమె వెళ్ళి బ్రాందీ తీసుకువచ్చి గ్లాసులో పోసి యిచ్చింది. రంగరంగా...ఇంక చెప్పనా వారిశృంగారం! రతీమన్మథులులే లెండి!

* *

ఆ సాయంకాలం

"ఇంతకూ ఆసంబంధం మాట ఏంచేశావ్?"

"ఏ సంబంధం?"

"అదే డాక్టర్ సురేంద్రని కూతురు..."

"సూరమ్మనా?

"అవును...ఎంత చక్కని దనుకున్నావ్...అందాలప్రోగు"

"ఏమిటో వెధవపేరు బాగోలేదు."

"పేరులో ఉందేమిటి? ఒకసారి చూడు— విడిచిపెడతావేమో!

"చూస్తే ఎవరిని విడిచిపెట్టానుకాబట్టి, దానిని విడుస్తాను?"

"అంచేతే...ఒకచూపు చూడమంటుంది."

"ఇంతకూనీకేమైనా కమీషన్ వుందేమిటి? మా అవస్థపడుతున్నావ్"

"ఛా...ఛా...నీవే నా కమీషన్."

"సరే...చూద్దాంలే...మొదలు ఈ సీసా నింపు".

అత డానందంలో మునిగిపోయాడు.

సుబ్బయ్య సూరమ్మను మరిగి, సుశీల ఎన్నికబుర్లు పంపినా రాలేదు. ఆదేమిటో మన కందనివందుమీదే ఆశ యెక్కువుంటుంది. ఆ సుబ్బయ్యతోటే లోకం అంటుంది సుశీల...

ఆ గుచేత ఈ గొడ్డు సూరమ్మను పెళ్ళిచేసుకుంటే, వీనితోకూడా చుట్టం గాపుకు సూరమ్మ ఇంటికి వెళ్ళవచ్చునని, అక్కడ సుబ్బయ్యతో పూర్వస్నేహం పురికొల్పవచ్చుననే అనుకుందిగాని, సుధీర్ అవాగాన్ని చూడలేదు. సుధీర్ సూరమ్మతోటే ఉంటే—సుబ్బయ్యకు ఎవరూ ఉండరు కాబట్టి తానే అతని అర్ధాంగిలాగ ఉండవచ్చుననుకుంది. చూడండి . కామం ఎన్నిపనులు చేయిస్తుందో! స్వార్థం లోకాన్నంతా కబళించినా శాంతించదు.

* * *

చీకటి పడుతూ పడుతూవుంది ఆ కాముకులిద్దరూ ఈప్రపంచాన్నే మైమరచి, పక్కమీద పడుకొల్లా దొర్లుతున్నారు అంతలో బూటు చప్పుడౌతుంటే ఎవరో మేడమెట్లు ఎక్కుతూ వున్నారు.

“ఎవరది” అని లోపలనుంచి ప్రశ్నించాడు.

ఆ వ్యక్తి మాట్లాడలేదు,

“ఏయ్ ఎవరది?”

ఆ నూతన వ్యక్తి నిప్పులు కక్కుతూ అతనిముందు నిలబడ్డాడు.

“ఎవర్ నువ్”

“తాగుబోతు కళ్ళకు లోకం తల్లకిందులుగా కనబడుతుందా?”

“అవును...నీ...వెవడవ్ ..ఇది నాయిలు”

“కాదు...ఇది నీ సమాధి”

“ఛాప్...సటప్”

“ఓరి తుచ్ఛుడా! వ్యభిచారానికి తోడు తాగుడొకటా?”

“అవును ..నీవంటి ద్రోహులుంటె ఏంచేస్తామ్—”

“నేను ద్రోహినా? భర్తను మోసంచేసే ఈ పాపి—అన్యాయపు మాటలువిని భార్యను నాశనం చేసిన నీవా—న్యాయమూర్తులా? తుచ్ఛుడా! తగిన నిదర్శనాలు లేకుండా మహాపతివ్రతను ఇంట్లోనుంచి గెంటివేశావ్. ఆమె హృదయం మండి, ఒక్కమాటందంటే, ఈ మేడతోకూడా మాడి, బూడిదైపోతావు.”

"అయితే అవనియ్—బూడిదౌతా—నా యిష్టం ఉంటే గాడిదౌతా—నీకే."

"ఆమె ఒక్క కన్నీటిచుక్క రాల్చిందంటే—మహాసముద్రం అయి నిన్ను ముంచెత్తకపోదు."

"ఏడిశావు—పో—"

"పోతా—నీమడా—పోతా. మళ్ళీ నీ భార్య పాదాలపై బడిన శిరలపై విజ్ఞానదీపం పెట్టడానికి వస్తా"

"సటప్...పో—"

సురేశ్ వారిద్దరి ముఖాలు చూచి—ఏవగింపుతో—తోకత్రొక్కిన త్రాచులా వెళ్ళిపోయాడు. ఆమె భయంతో అతని కౌగిలిలో దాగుంది—లోకం ఆకాముకులను చూడలేక చీకటి ముసుగు కప్పింది—ఏంచేస్తుందిమరి.

* * *

# ౯

సుధీర్ రాజమండ్రి జేరుకున్నాడు. పెళ్ళికూతురు చూపులకు బయలు దేరాడు. సూరమ్మ సునీతకంటె వేయిరెట్లు మెరుగనుకున్నాడు. "నా యినుప పాదాల క్రింద ఎన్నిపూలు నలిగి పోతున్నాయో! అలా నాశనం చేసేదానికంటే - ఒక స్త్రీకే మన జీవిత సూత్రాన్ని బంధించడం ధర్మం" అనుకున్నాడు సుధీర్.

సుధీర్ గుణగణాలు - పరదేశమున సంపాదించిన "డాక్టరు" బిరుదం ఆస్తిపాస్తులు డాక్టరుగారిని పూర్తిగా ఆకర్షించాయి. ఇక సూరమ్మగారి విషయం వేరే చెప్పాలా? అసలావిడ జీవితంలో అంత అందగాడిని చూడనే లేదు—కింపాంసర్గంతో కామించే కాముకి కన్నుల కాతడు బంగారు పర్వతంలా కనబడ్డాడు. ఆమె చీకటిగుండెలో అతడు మెరుపు; ఆమె ప్రేమ మందిరంలో అతడు పూజారి; ఆమె వలపులకు అతడు తుదిప్రాపు.

కొన్నాళ్లు గడిచాయ్. రెండు పక్షాలవారూ పెళ్ళికి ఒప్పుకున్నారు. కాని మూఢం అవడం వల్ల పెళ్ళిఆపుచేశారు. మూఢం వెళ్ళగానే పెళ్ళి

ఖాయం చేశారు. లగ్నం ఏర్పరిచారు. రోజా రాత్రి ఒంటి గంటకని నిశ్చయం చేశారు పెళ్ళి పెద్దలంతా.

* * *

సుధీర్ మాత్రం ఆ ఊరు విడిచి వెళ్ళడం లేదు. మార్వాడి సత్రములో మఖాం వేశాడు. మావగారు కబురు పంపుతుంటే — తప్పించుకుంటానికి వీలులేకో — పెద్దలను గౌరవించాలనో — కాబోయే ఇంటల్లుడనో తప్పకుండా రోజుకు ఒకసారైనా సుధీర్ అత్తవారింటికి వెళుతూ ఉన్నాడు. తల్లిదండ్రులు చూచీ చూడనట్టుగా కూతురుని, కాబోయే అల్లుని వద్ద వదిలేస్తూ ఉన్నారు. కారణం? కాబోయే భార్యాభర్తల మధ్య కలగజేసుకుంటం ఎందుకని కాబోలు.

ఒకరోజున మేడపైన నూతన ప్రియులు కూర్చున్నారు.

"ప్రియతమా! మీరింత ఆలస్యంగా వచ్చారే!"

"ఆలస్యం అయిందా?"

"మీరిలా వస్తే బ్రతకగలనా?"

"ఇవాళ లేవడం, కొంచెం ఆలస్యం అయింది."

"అయినా ఇంగ్లండు అలవాటు ఇండియాలో చేయకూడదు."

"ఒక్క నాటితో పోయేనా అలవాటులు.?"

"అలాగని ఆదొరలతో ఎప్పుడైనా 'పార్టీల'లో బ్రాంది పుచ్చుకుంటే ఇక్కడా పుచ్చుకోరుకదా!"

"నీ అధరామృతం ఉంటే వెధవ బ్రాందీ లెందుకు?"

"ఏమిటో అలాగే అంటారు — కొత్తలో."

"పిచ్చిదానా? రోజుకు రోజుకు ప్రేమ వృద్ధిపొందేదేగాని, తక్కువయ్యేదా?"

"కాదనుకోండి."

"మరింకేం?"

"పెద్దచదువు చదువుకున్నవారికెలాగైనా స్నేహితురాండ్రెక్కువుంటారనుకుంటా."

"నిజమే — కాని నీ స్నేహం చేసిన నప్పటినుంచి — ఇంక ప్రపంచమే జ్ఞాపకం ఉండడంలేదు."

"నా — తో — డూ?"

"సత్యంగా—దైవసాక్షిగా."

"ఒట్టూ!"

"ప్రమాణంగా!" అంటూ ఆమె చెయిపట్టుకొని చేతిలో వట్టు వేస్తున్నాడు.

ఆగోడ పక్కనే నిలబడి వారిమాటలు వింటున్న సుబ్బయ్య హృదయంలో శూలాలు నాటుతున్నట్లున్నాయి.

"ఆడదానిని నమ్మడానికంటే మృత్యువుని నమ్మడం మేలురా!" అనుకొంటూ మెల్లి కోపంగా నడవబోయాడు. అతని కాలి చప్పుడయింది. తోక త్రొక్కిన నల్లత్రాచులా ఆమె బయటకు వచ్చింది.

"ఎవరోయ్ అక్కడ?"

"——"

"మాట్లాడవేం సుబ్బయ్యా! నీవా?"

"చిత్తం, అమ్మగారు."

"ఇక్కడెందుకున్నావ్."

"అమ్మగారికి నా అవసరం ఏమన్నా ఉందేమోనని కనుక్కుందామని వచ్చానండి."

"నీ అవసరం ఏముంటుంది?"

"కూలి ముండాకొడుకును - నాతో అవసరం ఉంటుందని కాదండి."

"మరింకెందుకు?"

"బజారు వెళుతున్నాను...ఏమన్నా కావాలేమో కనుక్కుందామని వచ్చాను."

"మేడమీద అల్లుడుగారున్నారని తెలీదూ?—కేక వేయకుండా వస్తే ఆయనేమన్నా అనుకోరూ?"

"చిత్తం—ఇంగ్లండు దొరలు"

"ప్రతి 'సర్వెంటూ' పైకి రావడమే...ఇకనుంచీ వెర్రివెధవలా ఎప్పుడూ రాకు—ఇంక దయచేయ్. ఊ—వెళ్లు"

"వెళు...తు—న్నా!"

ఆమె మేడమీద గదిలోకి వెళ్ళిపోయింది. సుబ్బయ్య తలవొంచా

న్నుంచి వేరుచేసి, శూలానికి పొడిచి, అగ్నిగుండంలో వేసి బొగ్గుకింద మాడ్చివేస్తున్నట్లుంది.

"అహా! స్త్రీ కన్నులవెనుక ఎన్ని వర్షించే సముద్రాలైనా దాయ గలదు కదా! ఆహృదయంలో ఎన్ని అగ్నిగుండాలనైనా దాచివేయ గలదు కదా!...ఎవరూ లేనపు డీ రంకుటాలకు నేనే దేవుడ్నయ్యానా? ఇప్పుడు దెయ్యాన్నయ్యానా?_అసలీ ముండ నావంటివారి నెంతమంది నిలాచేసిందో లేకపోతే ఇంతకాలం నాతో అనుభవించి, నా యెదుటతన ప్రియునితో అలా మాట్లాడగలదా? పైగా నాసుఖమే తెలియనట్లు ఎలా చూస్తుందో చూడు___గుడ్లగూబలా కళ్ళు ఇదీనూ___అయినా నేనే ప్రాణంగా నమ్మిన సునీతిని విడిచి ఈ ముండతో ఉండమని ఎవరు చెప్పారు! ఎప్పటికైనా, పెళ్ళి కాని పిల్లలహాయి మేఘాలలో మెరుపులాగ క్షణమాత్రలే సుమా! వీళ్ళపని వద్దూ ఏమీవద్దు గాని నా సునీతివద్దకు పోతాను. పోయి, తిరిగి నా ఆనందప్రపంచాన్ని ఏర్పరచు కుంటాను." అనుకుంటూ సునీతి వద్దకు వెళ్ళాడు సుబ్బయ్యా బహద్దూరు.

* * *

అటు పాత ప్రియులైన సునీతా సుబ్బయ్యాలు ఆనందం అనుభవిస్తున్నారు. ఇటు కొత్త ప్రియులైన నూరమ్మ సుధీరులు ఆనందం అనుభవిస్తున్నారు. అటువారి పాపం - ఇటువీరి పాపం - పండి బద్దలయ్యేరోజు ఎప్పుడు వస్తుందా అని - కర్మదేవత వారిజీవిత గ్రంథాల్లో పుటలు తిరగవేస్తూ ఉంది.

* * *

ఆరోజు అమావాస్య

సునీతి పతి ఊరులో లేదు కదా అని...సుబ్బయ్యా సునీతలు పళ్ళూపైనా తెలియకుండా ఉన్నారు—సుధీర్ వల్ల అలవాటయిన బ్రాంది సుబ్బయ్యకూ_డా అలవాటు చేసింది సునీత...తాగుడు; వ్యభిచారం, జూదం. వేట, ఈదుర్వ్యసనాలన్నీ అంటువ్యాధులకింద అలముకుపోతాయి కదండీ.

సుబ్బయ్యా సునీతలు చెడతాగి, ఒళ్ళు మరచి దొర్లుతున్నారు.

ఇవన్నీ కనిపెట్టిన సునీత భర్త సుందరం దొడ్డి తలుపుకు తాళం

బిగించి, వీధి తలుపు దబదబా కొట్టటం ప్రారంభించాడు. దానితో సుబ్బయ్య ప్రాణాలు పైకి లేచిపోయాయి.

"సునీతా...ఎలా రక్షిస్తావ్...ఇక నా జీవితంలో మీ గుమ్మం తొక్కను."

"దీనికే భయపడితే ఎలా—ఇంత తాగినా గుండె ధైర్యం లేదేమిటి?"

"భ...యం"

"అదేమిటి అలా వణికి పోతున్నావ్"

"ఇప్పుడెలా?"

"దొడ్డిదోవుంది కదూ?"

"సరే—సరే త్వరగా..."

"ఏయ్...తలుపు...తలుపూ!" అని వీధి తలుపు కొడుతున్నాడు సుందరం.

ఆమె సుబ్బయ్యను దొడ్డి దోవను పంపడానికి తీసుకు వెళ్ళింది... తాళము వేస్తే ఎందుకొస్తుందా తలుపు...

"ఇ...ప్పు...డెలా?"

"తాళం వేశా రేవరో!"

"నీ మొగుడే...ఇవాళలతో నా ప్రాణాలు తీస్తాడు—ఇంక నాదివ వారాలు తప్పవు."

"భయం లేదు గాని—అటు ఎక్కి పో"

"అమ్మో! అటు కే!"

"లేకపోతే—ఇద్దరిప్రాణాలు తీసివేస్తాడు—అందులో మాఆయనకు కోపం వస్తే మనిషే కాడు"

"అయితే ఎక్కించూ—"

ఆమె నిచ్చెన సాయంతో సుబ్బయ్యను అటుకుమీద ఎక్కించి తలుపు తీసింది.

"ఏం? తలుపు తీయవే?"

"అబ్బా! ఏమిటి ఊరికే తలుపు కొడుతున్నారు—నిద్దర్లో నుంచి లేవాలా?"

"ఓహో! నిదుర పోతున్నా వేమిటి?"

"లేకపోతే మీ రోస్తారని కలగని తెల్లవార్లూ మేలుకుంటూ వను కున్నారా?"

"పొరపాటే__పద—పద__"

అంటూ తలుపు తీసి లోపలకు వచ్చి మంచంమీద పండుకున్నాడు_ వా ళ్ళిద్దరిని ఊరితీయనా?__కొంపకు నిప్పు పెట్టి తగల పెట్టనా? అని ఆలో చిస్తున్నాడు. పతివ్రిత పతిపద_సేవ చేయొద్దూ__అందు చేత సునీతమ్మ గా రాయన పాదాలు పిసుకుతూ కాళ్ళవద్ద కూర్చుంది.

"సునీతా! ఇలా ఎంతసేపు పిసుకుతావ్__పండుకో!"

"పడుకుంటా లెండి__ఎంత సేవ చేసినా మనల్ని పతివ్రితలనరు కదూ?"

"అనకపోవడం ఏమిటి__వీధివీధంతా "సునీత పతివ్రత సునీత పతివ్రత సునీత పతివ్రిత" అని ఘోషిస్తూ ఉంటే"

"ఎవరి మాటెలాగున్నా మీకు నమ్మకం ఉంటే అంతే చాలులెండి"

"ఛాఛా నమ్మకం లేకపోవటం ఏమిటి? నీ ముఖం__నీకంటే పతి వ్రిత అసలేదీ ఈలోకంలో... చాలు...చాలు ..సేవ ఎక్కువై పోతూంది_ ఇలా__రా!" అంటూ ఆమెను దగ్గరకు చేరదీశాడు.

ఈ లోపున అటుకు మీదున్న సుబ్బయ్యకాలు ఫలహారంగా పుచ్చు కున్నాయి రెండు మండ్ర గబ్బలు—అవి ఆనందంగా ఆచీకట్లో ఉంటే వాటిపైన కాలు వేశాడు__ఊరుకుంటాని కవి ఏమైనా గంగగోవులా__ దానితో తోకలు జాడించి చక్కా బోయాయి.

ఇక చూసుకోండి అనుబ్బయ్యగారి సుఖం! కార్తీకమాసం రాగాలు చలిలో గజగజ వణుకుతూ కుండ కావిలించుకొని__లేపినట్లు__ "ఉహుహు__ఊ__ఊ" అంటూ రాగాలు ప్రారంభించాడు.

"ఎవడే అది?"

"ఏదో దెయ్యమేమో!"

"ఆడదయ్యమా__మొగదయ్యమా__"

"మొగ దయ్యమేమో__శబ్దం ఘెక్కువ చేస్తూంది"

"దీన్నేమైనా మోహించిం దేమిటి చెప్మా__"

"నన్నెందుకు మోహిస్తుంది__మోహిస్తే మిమ్మల్నే మోహించాలి."

"అయితే వీపుచిట్లగొట్టనూ," అంటుంటే ఒక పిల్లిపిల్ల యెలకను తరుముతూ వచ్చి సుబ్బయ్య మీద పడింది—దానితో అమ్మో అంటూ గుమ్మడికాయ దొర్లినట్లు అటుకు మీద నుంచీ దొర్లి, వారిద్దరకూ మధ్య ఆ మంచంమీద పడ్డాడు వెన్ను విరిగేటట్లు—

"ఓ సేయ్—వీడెవడేయ్"

"ఎవడో దొంగముండాకొడుకులాగున్నాడు. మాస్తారేమిటి రెక్కలు విరగకట్టి నాలుగు బొమికలూ విరగగొట్టక."

"చేస్తా—అంతపని చేస్తా."

అంటూ మూలకఱ్ఱ తీశాడు. ఒక్కటి అంటించాడు.

"బాబోయ్—నే నేమి దొంగను కావండి—ఈ మెరమ్మని మీరు రాగానే అటు కెక్కమంటే ఎక్కానండి."

"ఏందుగడ్డి తినమంటే తింటావా?"

"ఓరి భడవముండా కొడకా—నిన్ను రమ్మన్నానా? చూచారా? ఇటువంటి దొంగముండా కొడుకులవల్లే సంసారాలు కూలిపోతాయ్"

"లేదు—రమ్మంది బాబు"

"నాకు తెలియదటోయ్——ఆరోజున అన్న అని చెప్పిన ఈ పతివ్రత నేడు దొంగంట; నాకు తెలీదా—మీరిద్దరి వ్యాపారం నాకు తెలీదా— పాపండాగుతుందా? ఉండండి—ఇవాళ మీయిద్దర్నె ఉరికంబానికి ఎక్కిస్తాను అంటూ సుబ్బయ్యను రెక్కలు విరిచి మంచంకోటకి కట్టి వెముకలిరగకొట్టేస్తున్నాడు - కిక్కురుమనకుండా చస్తున్నాడు సుబ్బయ్య— ఇంక సునీతి సంగతి చెప్పనవసరం లేదు.

"ఓ పతివ్రతా శిరోమణీ! ఇలాఎంత మంది కొంపలు కూలుస్తావ్" అంటూ బొమికలు కమల గొట్టేడు—కొట్టమూమరి—ఇంతకూ పాపానికి ఫలితం అనుభవించకుండా ఎవరున్నారు?

* * *

## ౧౦

పాతప్రియుల పాపం బయట పడింది; తగినశాస్తి అయింది... ఇంక మన కొత్తప్రియుల విషయం చూద్దాం.

"సుధీర్ మీ రెంత రసికులు"

"రసికతంతా నీ కనులచూస్తేనే అబ్బింది.

"మీ రెంత రసజ్ఞులు"

"సూరమ్మా! నా రసికతకు — నా రసజ్ఞతకు మార్గదర్శివి నీవు... నీవు లేకపోతే నేనే లేను — వసంతం రాగానే కోకిల నెవరు పాడమని చెప్పారు?"

"మీరు మహాకవుల్లా గున్నారే."

"నేను కవిని కాదు; నీకనురెప్పలపై మూల్గుతున్న భావాలు అక్షరాల ప్రాణం పోసుకొని నా నాలుక మీదుగా కవిత్వం అయి వెలువడుతవి. కవిత్వం అంటే ఏముంది? ప్రకృతి మనలో భావాలు రేకెత్తిస్తుంది; ఆ భావాలు తమకు కావలసిన భాషాసామగ్రిని తీసుకొని మాటలై - పాటలై - ప్రపంచంలో బయలు పడతాయి — అంతవరకు తలుపులు బిగించుకొన్న హృదయమందిరంలో మూగవేదన అనుభవిస్తూ ఉంటాయ్. తెలిసిందా ప్రియతమా?"

"తె—లి—సింది"

"నీవు నా ముందు నవ్వురతనాలు పోగుపోస్తే ఆనంద గీతికలు వెలువడుతాయ్. కన్నీటి నీలాలు గుమ్మరిస్తే విషాద గీతికలు వెలువడుతాయ్; అంతే — మీ చేష్టలే మా కవితామృతభిక్ష"

సూరమ్మ పారవశ్యములో మునిగి పోయింది. సుధీర్ కన్నులు రెండు నక్షత్రాలై ఆమెకేదో క్రొత్తప్రపంచములోకి దోవచూపిస్తున్నట్లు— తలుపులు తెరువ బడిన ఏదో తేజఃప్రపంచం ఆమెను ఆహ్వానిస్తున్నట్లు అనిపించింది. అటువంటివాడు తన భర్త కావడం తన పూర్వజన్మ పుణ్యం అనుకుంది. కారణం ఈ జన్మలో ఆమె యౌవన కుసుమాన్ని ఎందరు వాసన చూచారో లోకానికి తెలియక పోయినా ఆమెకు తెలుసు కదండీ—

ఆమె ఆనందం ఆపుకోలేపోయింది. అతని కౌగిలిలో మల్లెపూలమాలై వాలిపోయింది అతడు బిగియార కౌగిలించుకొన్నాడు.

"సుధీర్ — అబ్బా! — ఎంత బాగుంది."

"— —"

"ప్రియా! నిన్ను విడిచి ఒకక్షణం బ్రతకలేను."

"ప్రేయసీ! నిన్ను విడిచి ఒక్క క్షణంకూడా బ్రతుక లేను"

తిరిగి స్వచ్ఛమైన బిగి కౌగిలి అంతలో క్రొత్త అల్లునిగారికి ఫలహారాలు తీసుకొని ఇంటిమనిషి మాన సుశీల వచ్చింది... వారిని చూచింది—వారి చివరి మాటలు విన్నది. అతను ఎవరు?

"ఆమె భర్త సుధీర్—"

అంతే—ఆమెకన్నుల నెవరో పొడిచినట్లు... హృదయాన్ని చీల్చినట్లు—రక్తంచిందినాన్ని వంటినిండా పూసినట్లు - పాములు ఒకటిరెండుగా అల్లుకొని ఆమె కంఠాన్ని బిగిస్తున్నట్లు తోచింది.

ఆమె చేతులు పట్టు తప్పాయి—పళ్ళెం పూర్వాంకంటే తీవ్రంగా క్రింద పడిపోయింది. పాలు నేలమీద ఓడికలు కట్టాయి. సుధీర్ చూచాడు పోల్చుకున్నాడు.

"ఎవరు?"

"——"

"సుశీ—"

"———"

"సు—శీ—"

"సు—ధీ—ర్"

"నీ—వే—నా"

"ఆ—అ—వును?"

ఆమాట వినబడిన్న ఆమె పెదవులు, గాలిలో కదిలిపోతున్న మామిడిచిగుళ్ళలాగ అల్లాడిపోయాయి—నీరు నిండిన కనులు నీలిమేఘాల్లాగ చెదిరి పోయాయి.

అంతే—ఆమె చరచరా మెట్లు దిగి బాణంలా వెళ్ళిపోయింది—

"సు—శీ"

ఆమె జవాబు చెప్పకుండా వెళ్ళిపోయింది

వారివింత చూసిన కన్నమ్మ ఆశ్చర్యపోయింది.

"మీకు తెలుసా"

"కొంచెం"

"ఊహూ"

"ఇక్కడుంటుందా?"

"ఇంకా వెళ్ళేదేమిటి? ఆ మేడ పనిమనిషండీ!"

"పని మనిషా!"

"ఇలాభిగారు పడతారే— అది మనిషికే— సంవత్సరం పైగా ఇక్కడే పని చేస్తూ ఉంది— ఆసక్షణాత్రం నాడు లేదు సుబ్రమణ్యం! వాడి పెళ్ళామే నండీ"

"పెళ్ళామా!"

"దాంట్లో ఆశ్చర్యం ఏముంది? అయినా ఆ వేధపముండే ఎప్పుడూ ఇలాగే మంచి సమయంలో వస్తుంది"

"— —"

"ఈ పర్యాయం రానియ్యండి చర్మం వలిపించి నా చెప్పులు కుట్టిస్తాను"

ఆమె కాయింట జరుగుతున్న మర్యాద తెలుసుకున్నాడు.

"ప-ని-మ-ని-షా! పెళ్ళయిందా!"

"ఏమిటండీ ఖంగారు?"

"మనిమనిషా! పెళ్ళయిందా!"

అతడు ఆలోచనలో పడిపోయాడు ..ఆమెతో ఏదో మాట్లాడుతున్నాడన్నమాటే కాని, అతని హృదయం అంతా సుశీలమీదే ఉంది.

"సుశీల ఎంతగా మారిపోయింది...కృశించుకు పోయిన మసిపి వత్తి లాగై పోయిందే...ప్రపంచంలో బాధంతా, ఆమె కన్నుల్లోనే దాగుందే, ఎలాగై పోయిందో!

పనిమనిషా? పెళ్ళయిందా? ఏమిటాశ్చర్యం? ఆమె కనులలో పవిత్రాగ్ని ఎలా ప్రజ్వరిల్లిపోతూందో! ఆమె మహాపతివ్రత కాకపోతే, ఇలా పగలల్లా కష్టపడి బ్రతికటం ఎందుకు? సౌందర్యానికి ఎవడు పాదాక్రాంతుడు కాడు?

సుశీల పనిమనిషా? పాపం ఎంతపతివ్రత కాకపోతే ఈ బాధ పడుతుంది. శరీరం కామపిశాచానికి అమ్ముకుంటే భాగ్యలక్ష్మి యింట్లో నృత్యం చేస్తూ ఉండదూ? వసంత శుభోదయంతో ప్రేమారాధన ఆయింట జరుగుతూ వుండదూ? సంగీత సాహిత్యాలతో సరససల్లాపాలతో ఆయిల్లు నిత్యకళ్యాణం పచ్చతోరణం గా ఉండదూ?

తప్పక మా సుశీల పతివ్రతే అయితే పెళ్ళి ఎలాగైంది? అహాహా! పతివ్రతను రంకుటాలని చెప్పగలిగిన ఈలోకం - పెళ్ళి అయిందని మాత్రం చెప్పలేదూ? అబద్ధాలకు అనేకట్టలెక్కుతున్నాయ్... చెడుభావాలను సంకెళ్ళతో ఎవరు బంధించగలరు? మా సుశీల పతివ్రతే......

పాపం — ప...ని — మనిషి

సుధీర్ అలా క్రుంగిపోతున్నాడు — చీకటి చేతుల్లో అతడు చితికిపోతూ ఉన్నాడు.

ఆ రాత్రి

సుశీల విషయం తెలుసుకునితీరాలని బయలుదేరాడు. వెళుతున్నాడు. ఇల్లు తెలుసుకున్నాడు, అతని పాపపు శిరస్సుపై పెట్టబోయే విజ్ఞాన దీపాన్ని వెలిగిస్తున్నట్లున్నాడు సురేశ్. నేను పతివ్రతని నీచేత రుజావు చేయించగలను సుమా అంటూ సుశీల అన్నట్లుగా అతని పూర్వజీవితం అంతా కన్నుల ముందు కనబడుతూ వుంటే తేలిపోతున్న కాళ్ళతో తూలిపోతూ వెళ్ళిపోతున్నాడు సుధీర్ .

* * *

ఆరాత్రి అదారే వెళుతున్నాడు. అంతలో రక్తం కక్కుకుంటూ పరుగు పరుగున రైలు దిగి సుధీర్ కొరకు సురిత వెళుతూ ఉంది — ఆ చీకటిలోనే సుధీర్ని పోల్చుకుంది.

“సుధీర్ సుధీర్”

“ఎవరు? సుశీ!”

“కాదు — నేను పాపిని — బానిసను — కాముకిని” అంటూ నిలువలేక అతని పాదాలపై పడిపోయింది.

“ఏం సురితా! ఇలా వచ్చావ్! ఇంకా చీకటి కాటుక నా జీవిత మందిరానికి పూయడానికి వచ్చావా?”

“లేదు — లేదు. ని ప్రేమజ్యోతిని దాచిన చీకటిని, కన్నీళ్ళ చేతులతో తుడిచి వేయడానికి వచ్చాను — ని పాపపు జీవితాన్ని నా కన్నీటితో తుడిచి వేయడానికి వచ్చాను.”

“ఏమిటీ సంగతి”

"నీ కొక మహారహస్యం చెప్పి—నా జీవితాన్ని నీ పవిత్రపాదాలకు ఆహుతి చేయడానికి వచ్చాను."

"ఏమి టా రహస్యం సునీ."

"సుశీల మహాపతివ్రత...అంతటి యిల్లాలీ ప్రపంచంలోనే లేదు... ఆవిడమీద అపవాదులన్నీ కల్పించిన కులటను నేనే."

"ని__జం"

"మృత్యుశల్పంమీదకూడా అబద్ధా లాడగలరా సుధీర్."

ఈ సూరమ్మ పట్టి వ్యభిచారిణి. దానిని పెళ్ళిచేసుకోవక...నీసతి పద ములపై వాలి క్షమా భిక్ష పెట్టమను."

"క్షమాభిక్షా!"

"ఊఁ......"

ఆమె గుండె చిదికిపోయిందేమో, మరల ఒక గుక్కెడు రక్తం కక్కింది.

"ఇదేమిటి సునీతా—ఈ రక్తం."

"మృత్యుదేవత ఆకలి చల్లార్చే అమృత భిక్ష."

"సునీ—అయితే ఆ పాపాయి ఎవరిపాపాయి."

"ఇంకా సంశయమా! సుధీర్! ఆ పాపాయి నీ పాపాయే. నీవు ఇంగ్లండు వెళ్ళేసరికి ఆమెకు నాలుగో నెల గర్భిణి, సిగ్గుచే నీకాసంగతి వ్రాయలేదు.

"అబ్బా! ఎంత పొరబడ్డాను."

"సురేశ్ కు నీవంటే పంచప్రాణాలు...ఆమెను సొంత చెల్లెలక్రింద చూచుకున్నాడు—నాకు తెలుసును."

"అబ్బా! ఎంతపని చేశావు సునీతా—నీ మాయమాటలు వినే నా కాపరానికి కాలాగ్నిని అంటించాను."

"అందుకనే ఇలా రక్తం కక్కుకుంటూ చావడం;"

"అయితే పెళ్ళయిందని సూరమ్మ చెప్పిందే."

"చెప్పేకేం జేస్తుంది. సూరమ్మకూ నాకూ ప్రియుడైన సుబ్బయ్య స్నేహం—ఎదటవారిని పతివ్రతలుగా కనుపించనీయదు సుధీర్!"

"పెళ్ళి కాలేదన్నమాట—అప్పుడే ఎలాగౌతుంది."

"సురేశ్ వలె సుబ్రమణ్యం తోబుట్టువులాగ చూచుకున్నాడు."

"సునీతా! ధన్యుడను ధన్యుడను—నా జీవితంలో అనుమానాగ్నిని కురిపించిన నీ చేతులే—ప్రేమామృతాన్ని కురిపించాయి. మండే మంటలు చల్లార్చాయ్."

"అసలామె బ్రతికింది తన "కన్నబిడ్డ" కొరకే సుమా!"

"అవును"కన్నతల్లి" ప్రేమకు లోతులు లేవని ఇప్పుడే ఈ పాపికి తెలుస్తూవుంది."

"సుధీర్ ఈపాపి ప్రాణాలు శాంతిగా పోనియ్."

"సుధీర్"

"ఈ పాపపు శరీరాన్ని నీ పవిత్రపాదాలపై విడిచిన నా ఆత్మ మీ చిట్టితల్లిని "దీవిస్తుంది లే."

"సునీత్"

"క్షమించావా?"

"మనసార క్షమించాను—భగవంతుడు నీ ఆత్మకు శాంతి నిస్తాడు."

"శాంతి——శాంతి—పతివ్రత—కన్నతల్లి."

ఆమె మరో రెండు గుక్కలు రక్తం కక్కుకుంది. సుధీర్ పాదాలకు రక్త చందనం పూసింది; పరలోకంలో పతివ్రత అయింది.

* * *

సుధీర్ ఆనందంతో ఆ శరీరాన్ని రెండు చేతులమీదా వేసుకొని సుశీల యింటికి బయలుదేరాడు—కోర్టుకు సాక్షిని తీసుకు వెళ్ళేవానిలాగ.

సుశీల యిల్లు కనుక్కొని వెళ్ళాడు. అతని కన్నుల నీతడు నమ్మలేక పోయాడు. ఆయింట్లో ఎవరూ లేరు. ఆప్రక్కింటివారే నడిగాడు. వాళ్ళంతా కొన్ని నిమిషాలక్రితమే పడవెక్కి ఎక్కడకో వెళ్ళి పోతున్నారని—మళ్ళీ ఎన్నడూ ఆఊరు రారనీ చెప్పారు ప్రక్కింటివారు.

"రా—రా—రా—రా!" అంటూ సుధీర్ నిర్ఘ పోయాడు.

"రారట బాబూ!"

"రా—రా!" అంటూ ధిగాలుపడి నేలమీద కూలి పోబోయాడు.

"బాబూ! అయినా ఆగోదావరి పడవలరేవు దగ్గరకు వెళ్ళి చూడండి అందులే అందొచ్చును,

"అలా—గా"

అతని జీవితంలో ఆశాజ్యోతి వెలిగింది.

వెంటనే వచ్చి, ఒకపాతయింటి ప్రక్కనదాచిన సునీత శవాన్ని తీసుకొని గోదావరి వద్దకు వెళ్ళిపోయాడు.

* * *

అది పవిత్ర గౌతమీ తటం గౌతమీ గంగ వెన్నెట్లో వేదముత్తయిదు కుంకుమ బొట్టు లాగ కలకలాడుతూఉంది. చంద్రుడు తన సహస్ర కిరణాలతో గౌతమీ నదికి చక్కిలగింతలు పెడుతున్నాడు—కాని వారి ఆనందాన్ని చూడలేక మధ్యమధ్య మాయలా మబ్బులు చంద్రుడ్ని అరచేతి మాటున దాచి వేస్తున్నాయి.

ఆవెన్నెట్లో పడవ వెళ్ళిపోతూఉంది.

"కన్నతల్లి" చిట్టితల్లి నెత్తుకొని చంద్రుడ్ని చూపిస్తూంది. అంతవిచార సముద్రంలో కూడా అపాపాయి ఆనందమే ఆమెను తీరాన్ని చేర్చే పూలపడవైంది.

సుధీర్ పడవ చూచాడు.

"సుశీ...సుశీ...సుశీ" అని కేక వేశాడు—తీరందాటిన వారికి, తీరం మీదున్న వారి మాట లెలా వినబడతాయి? అతని హృదయం శరవేగంతో కొట్టుకుంటూ ఉంది. సుశీలను చూడనైనా చూడాలి—ప్రాణాలు విడువనైనా విడవాలి అనే నిర్ణయంలోకి వచ్చేశాడు.

"సునీతా—ఇదిగో—ఈ పవిత్ర గౌతమీ హృదయమే నీకు దివ్య సమాధి; ఆదేవి నీపాపాగ్నిని, చల్లని చేతులతో ఆరిపివేస్తుందిలే"

అంటూ శవాన్ని గోదావరిలో పారవేసి, ఒకేలక్ష్యాన్ని అనుసరించే భక్తునిలాగ, బోటును మాస్తూ గోదావరిలో ఈదుతూ "సుశీలా—సుశీలా అని మధ్య మధ్య కేక వేస్తూ త్రాచు పాములా వెళ్ళిపోతూ ఉన్నాడు.

కొన్ని నిమషాలకే పడవ సమీపించాడు. ఎవరా అది అని సుశీల చూస్తూనే ఉంది,

"సుశీ—సుశీ" అనే కేక వినబడింది.

"సుధీర్ సుధీర్" అనిపిలచింది

"సుశీ...పడవాపు—సుశీ"

"సుధీర్" అంటూ ఉంటే ఆమె పిలుపు అపూర్వమైన శక్తినిచ్చింది. ఒక్కనిమిషంలో సహన తెచ్చుకొని సుశీల చేతు లిచ్చింది. స్వర్గధామం ఎక్కినట్లు ఆమెచేతుల ద్వారా ఒడ్డు ఎక్కి పోయాడు.

"సుశీ" అంటూ ఆమె ఒడిలో తల పెట్టి ఒడిలోనే వాలిపోయాడు.

"ఏదీ—నాచిట్టితల్లి" అని పాపాయిని హృదయంమీద పండుకో బెట్టుకొని, తల పిచ్చురాలి కదలికతో నెమ్మదిగా మోపి ఆమెను కారే కన్నీరుతో చూస్తూ—

"సుశీ, పాపిని—ని పతివ్రతా శాస్త్రాలతో దహించి క్షమించవా" అన్నాడు. జాలితో—ఆమె హృదయంలో వేయి వీణలు ఒక్కసారి ప్రేమ నాదాన్ని వెలువరిచాయి.

"సుశీ—క్షమించవా"

"నేనా"

"నీవే—నాభగవతివి"

అతనికి జవాబుగా ఆమె అశ్రుబిందువులు; భగ్గు భగ్గు మని మండిపో తున్న అతని పాలభాగాన్ని పడ్డాయి. అతని జీవితం చల్లబడి పోయింది.

చంద్రుని మాయదారి మబ్బులు విడిచి వేశాయి. పాపాయినవ్వులో వారు కరిగి పోయారు.

"అమ్మా! నాన్న"అని పాపాయి తండ్రిని తల్లి కెరుకపరచింది.

అంతా నవ్వుకున్నారు.

"సుశీ! ఈయనేనా మీ అన్న సుబ్రమణ్యం గారు"

"అవును. ఈయనే మన ప్రాణదాత"

"నమస్కారం"

సుబ్రమణ్యం ఏమీ అనలేక వెఱ్ఱివానిలా రెండు కన్నీళ్లు రాల్చాడు వారి ఆనందాశ్రువులలో పున్నమి చంద్రుడు ప్రతిఫలించాడు. చిరునవ్వు మొగముతో పడవ వాడు పాట ప్రారంభించాడు. అంతా పాడుతూ మరో ఆనంద ప్రపంచంలోకి వెళ్లిపోయారు, తీరం చేరిపోయారు.

* * *

అది సుధీర్ యమ్. ఏ. బార్ట్లా గారి మహాభవనం _ ఒక ఫ్లెజరు కారు ఇంటి ముందు పెద్దతోట, పాపాయినెత్తుకొని "కన్నతల్లి" పూలు కోస్తున్నది. "కన్నతండ్రిని" చూపిస్తూ.

"పాపా_ ఎవరమ్మా అది" అని అడిగి "మా నాన్న" అంటుంటే తండ్రి దగ్గరకు వచ్చి పూలు పాపాయి కిచ్చి

"సుశీ! చూడు పాపాయి ఇప్పు డెవరి వద్దకు వస్తుందో"_అంటూ—"పాపా! రావూ తల్లీ! మీనాన్న దగ్గరకు" అంటే

"ఇదో"

అంటూ పాపాయి నవ్వుతూ తండ్రి చేతుల్లోకి వాలిపోయింది.

"అమ్మనుండా. నాన్నదగ్గరకు వెళతావా?"

"నా దగ్గరకు రా అమ్మా—చిట్టీ రావూ".

"ఇదో" అంటూ "కన్నతల్లి, చేతుల్లో కలవపూలాగ వాలింది.

ఆ పాపాయిని చూచుకుంటూ వారిద్దరూ మురిసి పోతున్నారు. ఆమె "ఆనందమేగా వాంఛనీయము" అని పాట ప్రారంభిస్తే

"అవని బ్రతుకే ఆశావశము
భావిసుఖమే జీవితాశ"

అంటూ సురేశ్ చేతిలో ఒక పెద్దపుస్తకాన్ని పట్టుకొని వచ్చాడు.

"ఏరోయ్—సురేశ్—రా—రా—క్షమించు" అంటూ సుధీర్ ముందు వెళ్ళాడు."

"క్షమించాలా—ఓరి ఫూలా! అయినా ఎప్పుడొస్తానో చేప్పాగా"

"చెప్పావుగాని షంక చంపక"

"సరే—వదిలేశాను."

"అయితే ఆపుస్తకం ఏమిటిరీ"

"ఛీ ఛీ నీవు ముట్టుకోక - మా చెల్లమ్మ చేతులతో ఓపెన్ చెయ్యాలి," అంటూ ఆపుస్తకం చేతికిచ్చాడు.

# కన్నతల్లి

అని అచ్చువేసి ఉంది. అందరి కనులు వికసించాయి. అట్టమీద సుశీల నెత్తుకొన్నా చిత్రం ఉంది. దానిక్రింది "భారత స్త్రీజన్మ మాతృత్వమునందే సాఫల్యమగును" అని వ్రాసిఉంది. దానిలో సుశీల ఫోటోలు—సుశీల దినచర్య—అంతా వ్రాసిఉంది. వారి ఆనందానికి అంతులేదు. సురేశ్ వారి యింట్లోనే వుండిపోయాడు. సుబ్రహ్మణ్యం తల్లికిప్పుడు ఇద్దరు పరిచారికలు. అతని జబ్బంతా పోయింది—రాజులా షికారు కొడుతున్నాడు వీధుల్లో. ఇలా వీరానందప్రపంచలో ఉంటే—వారు అయోమయ ప్రపంచంలో ఉన్నారు.

ఇక మనమో!

తేజః ప్రపంచంలో ఉందాం.

ఏం?

| | |
|---|---|
| శ్రీ ఆం॥-అన్నామలై విశ్వ విద్యాలయం | మళ్లీ మనకో తేజః ప్రపంచం తలుపులు విజ్ఞాన కిరణాల చేత తెరుద్దాం లెండి ఉండనామరి |

మీ

గత నా కాలం 21-11-42 చంద్రమే



# జంపనవారి క్రొత్త నవలలు

| | |
|---|---|
| సతి 1 భా | 0-8-0 |
| పతి 2 భా | 0-8-0 |
| ఆశ 1 భా | 0-8-0 |
| దురాశ 2 ,, | 0-8-0 |
| నిరాశ 3 , | 0-10-0 |
| కన్నీరు | ,, |
| బలిపీఠము | ,, |
| పెళ్ళి | ,, |
| కన్నతల్లి | ,, |